# పీఠిక.

ఇయ్యది భారతములోని యొక యుపకథ. అష్టాదశ పురాణములను, ఉపపురాణములను స్మృతిసూత్రములను రచించిన వ్యాసభగవానుఁడే దీనికిఁ గర్త. దీని నాదికవులని ప్రసిద్ధిగాంచిన నన్నయ్య, తిక్కన్న, యెఱ్ఱాప్రగ్గడ యను మూవురుకవులు తెనిగించిరి. అందాదిమ కవియగు నన్నయ్య యాదిసభాపర్వములను, నరణ్యపర్వములోఁ గొంతభాగమును రచించెను. తిక్కన యారణ్యపర్వశేషము నేమికారణముననో పూరింపక విరాటపర్వము మొదలిడి 15 పర్వములను రచించి భారతమును పూర్తిగావించెను. ఎఱ్ఱాప్రగడ నన్నయ్య వదిలి పెట్టిన యారణ్యపర్వ శేషమును మాత్రము పూరించెను. కథాసందర్భమ్ము జూడమున శత్రువులచే నోటువడి రాజ్యక్షరాదులఁ గోలుపోయి ధర్మరాజు తమ్ములతోను భార్యతోను గఠినవ్రతుఁడై యరణ్యవాసము చేయుచుండ నొకనాఁడు బృహదశ్వుఁడనుముని యొకఁడాతనికడకువచ్చి యాతని నూరార్చు నెపమునఁ బూర్వమాతనివలె జూదముచేఁ గష్టములపాలైన యొక మహారాజుకథఁ జెప్ప నెంచి యీకథ చెప్పినవాఁడాయెను.

ఇతివృత్తము-నిషధ దేశాధిపతియగు నలుఁడను మహారాజొకఁడు యౌవనశాలియై సకలసుగుణములతోఁ దన రాజ్యమును బాలింపుచుండ నాతని రూపగుణములను విదర్భదేశాధిపతియగు భీమరాజుకూతురు దమయంతి విని యాతనియందు దనచిత్తంబు హత్తించె. భీమరాజు తనపట్టియభీష్టంబు గుర్తెరింగి స్వయంవరంబు చాటించెను. రాజులందరితోఁ బాటు నలమహారాజును వచ్చుచుండ మధ్యమార్గంబున నింద్రాదిదేవతలు దమయంతిని వరియింపఁగోరి వచ్చువారాతనిని గలుసుకొని యాతనినే దమయంతికడకు దూతగాఁ బంపిరి. నలమహారాజు దూత్యముచేఁ జలింపక దమయంతి నలునిఁదక్క వేరొక్కనినిఁ

బెండ్లాడ నిచ్ఛగింపదయ్యె. తుదకు స్వయంవరంబున నలునే వరించి వివాహమాడెను. దమయంతి తన్ను వరింపలేదనుగినుకచేఁ గలిపురుషుఁడు సమయము వేచియుండి నలునందు బ్రవేశించి యాతనిచేఁ బుష్కరునితోఁ జూదమాడించెను. అందు నలుఁడోడిపోయి భార్యతో నరణ్యముఁ బ్రవేశించి [illegible] నాఁడు దమయంతి [illegible] సమయమున నెడఁ [illegible] వదలిపోయెను. [illegible] డవులఁ దిరిగి తిరిగి తుదకుఁ దన పినతల్లియిల్లుఁ [illegible] టినుండి భీమరాజుచేఁ బంపఁబడిన బ్రాహ్మణులామె [illegible] ది తండ్రికడకుఁ దీసికొనిపోయిరి. నలుఁడును నరణ్యంబునఁ గుమ్మరువాఁడు కర్కోటకుఁడనుసర్పముచేఁ గరువఁబడి విరూపుఁడై తనయిష్టము వచ్చినపుడు స్వరూపమును గొను వరంబును బొంది యయోధ్యాధిపతియగు ఋతుపర్ణుని కడ బాహుకుఁడను పేరుతో సారథ్యము, వంటయు చేయుచుండెను. దమయంతిచేఁ బంపఁబడిన బ్రాహ్మణునిచే నలుఁడయోధ్యలోనుంట యెరింగి భీమరాజు దమయంతికి ద్వితీయ స్వయంవర మిషమున నలుని విదర్భకు రప్పించెను. దమయంతి యంతనాతని లక్షణములను గొన్నిటినిఁ బరికించి గుర్తించెను. నలుఁడును గర్కోటకునిఁ బ్రసాదముచే స్వస్వరూపమును గాంచి యందరికిని నయనోత్సవము గావించి కలివర్జితుఁడై పునర్ద్యూతమునఁ బుష్కరునోడించి రాజ్యమునుబొంది సమస్తసుఖముల ననుభవించెను.

నలుఁడు ధీరోదాత్తుఁడు. కష్టముల నన్నిటిని సహించెను. తుదకు సుఖములఁ గాంచెను. దమయంతియు నెట్టికష్టములయందును పాతివ్రత్యమును విడువక కీర్తిఁ గాంచెను.

మారిస్‌పేట, తెనాలి. చివుకుల లక్ష్మీనారాయణశాస్త్రి.



శ్రీరస్తు.

# నలోపాఖ్యానము.

శ్రీ రమ్య, ధర్మ నిత్య
ప్రారంభవిభాసి, రాజ ♦ పరమేశ్వర, ఘో
రారి మద కుంభి కుంభ వి
దారణ దారుణకృపాణ ♦ దక్షిణహస్తా! 1

టీ. శ్రీరమ్య = సంపదచే నొప్పినవాఁడా, ధర్మ...విభాసి - ధర్మ = ధర్మముయొక్క, నిత్య = ఎడతెగని, ప్రారంభ = ప్రయత్నముల చేత, విభాసి = ప్రకాశించువాఁడా, ఘోర...హస్తా-ఘోర = భయంకరులైన, అరి = శత్రువుల, మదకుంభి = మదపుటేనుఁగులయొక్క, కుంభ = గండస్థలముయొక్క(ను); విదారణ = చీల్చునట్టి, దారుణ = క్రూరమయిన; కృపాణ = ఖడ్గముగల; దక్షిణహస్తా = కుడిచేయిగలవాఁడా; రాజపరమేశ్వర = రాజపరమేశ్వర అను బిరుదముఁగలవాఁడా!

ఓ రాజరాజనరేంద్రుఁడా! అని కృతికర్తయగు నన్నయభట్టు కృతిభర్తయయిన రాజరాజనరేంద్రుని సంబోధనచేయుచున్నాఁడు.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు శాంత
వచనంబుల భీమసేనునకుం గోపాటోపశమనంబు సేయు

చున్న ధర్మరాజునొద్దకు బృహదశ్వుండను మహామునివచ్చి విధిదృష్ట విధానంబునం బూజితుండై విశ్రమించియున్న నమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరులైన పరులచేతం దమపడిన నికారప్రకారం బంతయు నెఱింగించి యిట్లనియె.

టీ. ఆకథకుఁడు=ఆకథలు చెప్పెడి సూతమహాముని; శౌనకఆదిమునులకున్ = శౌనకుఁడు మొదలగు మునులకు, చెప్పెను. అట్లు శాంతవచనంబులన్ = సౌమ్యదియైన మాటలచేత; భీమసేనునకున్ = భీమునికి, కోప ఆటోప = కోపాధిక్యము, ఉపశమనంబు = తగ్గించుటను; చేయుచున్నధర్మరాజునొద్దకున్ బృహదశ్వుండు అను మహాముని వచ్చి; విధిదృష్ట = శాస్త్రములందు జెప్పఁబడిన; విధానంబునన్=ప్రకారమున, పూజితుండై = గౌరవింపఁబడినవాఁడై; విశ్రమించిఉండన్ = బడలిక తీర్చుకొని, అమునివరునకున్ = ఆమునిశ్రేష్ఠునికి; ధర్మతనయుఁడు = ధర్మరాజు, అధర్మపరులు = అన్యాయమే ప్రధానకార్యముగాఁగలవారు ఐన; పరులచేతన్ = శత్రువులవలన; తమపడిన నికారప్రకారంబు = తామనుభవించిన యపకారవిధానము అంతయు ఎఱింగించి ఇట్లు అనియెన్.

క. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావళులఁ గలసి • విపినంబులలోఁ
గడుకొని మాయట్లిడుమలఁ
బడిననరులు గలరె యొరులు • పరమమునీంద్రా! 3

టీ. పరమమునీంద్రా=గొప్పమునిసత్తమా, పుడమియున్ = భూమియును, రాజ్యము, బంధులన్= చుట్టాలను, విడిచి: మృగావళులన్=మృగములగుంపులతో కలిసి, విపినంబులలోన్=అడవులందు; కడుకొని=మిక్కిలి; మాయట్లు= మావలె; ఇడుములన్ = కష్టములను, పడిననరులు = అనుభవించిననరులు, ఒరులు= ఇతరులు, కలరె =కలరా?.

వ. అనిన నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డిట్లనియె. 4

టీ. అనినన్, అయ్యుధిష్ఠిరునకున్ = ఆధర్మరాజునకు, బృహదశ్వుండు ఇట్లు అనియెన్.

క. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళి ♦ తో వచ్చి యర
ణ్యావాసము సేసెదు ధర
ణీవల్లభ ! నీవు ధర్మ ♦ నిష్ఠితబుద్ధిన్. 5

టీ. ధరణీవల్లభ = ఓపుడమిఱేఁడా ! నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్=ధర్మమునందుంపబడిన తలంపుతోడ, దేవసములు = దేవతలతో సమానులయిన అనుజులతోన్ = తమ్ములతోను, విప్రులతోన్ = బ్రాహ్మణులతోను, రథఅళితోన్ = రథసమూహముతోను, అరణ్య ఆవాసము చేసెదు= అడవిలోఁ గాఁపురమున్నావు.

క. నరసుతుఁడు దొల్లి నలుఁడను
ధరణీశుఁడు జూదమాడి ♦ తనవిభవము పు
ష్కరుచేత నోటువడి యొ
క్కరుఁడ కరం బిడుమపడఁడె ♦ కాననసీమన్. 6

టీ. తొల్లి=పూర్వము; నరసుతుఁడు=జనులచేఁ బొగడబడిన, నలుఁడు, అను, ధరణిఈశుఁడు=భూనాథుఁడు(రాజు) జూదముఆడి, తనవిభవము = తనసంపదను; పుష్కరుచేతన్=పుష్కరునివలన; ఓటువడి=ఓడిపోయి; ఒక్కరుండ=ఒక్కఁడై; కాననసీమన్ = అడవియందు; కరంబు=మిక్కిలి; ఇడుమపడఁడె=కష్టముల పొందలేదా ?

వ. అనిన నదియెట్లని ధర్మనందనుం డడిగిన నాతనికి బృహదశ్వుం డిట్లనియె, నిషధేశ్వరుండైన వీరసేనుని కొడుకు

నలుండనువాఁ డనేకాక్షౌహిణీపతి యనవరతాక్షప్రియుం
డజేయుండైన తనతేజంబున నెల్లరాజులఁ జయించి బ్రహ్మ
ణ్యుండై బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయు
చున్నంత. 7

టీ. అనినన్, అది, ఎట్లు, అని, ధర్మనందనుండు, అడిగినన్, అతనికిన్, బృహదశ్వుండు, ఇట్లు, అనియెన్, నిషధఈశ్వరుండు=నిషధదేశపురాజు, ఐన, వీరసేనుని కొడుకు, నలుండనువాఁడు, అనేకఅక్షౌహిణీపతి= పెక్కుఅక్షౌహిణులసేనలకు రాజు, అనవరత అక్షప్రియుండు= ఎల్లప్పుడును జూదమందిష్టము గలవాడు, అజేయుంబు=(శత్రువులచే) గెలువ నలవి కానివాని, తన తేజంబునన్= తనపరాక్రమముచేత, ఎల్లరాజులన్, జయించి, బ్రహ్మణ్యుండుఐ=బ్రాహ్మణభక్తిగలవాఁడై, బ్రహ్మఉత్తరంబుగాన్ =వేదములేప్రమాణముగా; ప్రజాపాలనంబుచేయుచున్నంతన్ =జనులఁబాలించుచుండఁగా.

సీ. అటవిదర్భాధిపుఁ ♦ డైన భీముం డను
వాఁ డనపత్యుఁడై ♦ వ్రతము లోలి
సలుపుచు దమనుఁడన్ ♦ సన్మునిఁ బత్నియుఁ
దాను నుపాసించి ♦ తద్వరమున
దమయంతి యను కూఁతు ♦ దమదాంత గమనులన్
సుతులను బడసె వి ♦ శ్రుతగుణాఢ్యుఁ
డందుఁ గన్యారత్న ♦ మగు దమయంతి దా
నత్యంత కాంతిరూ ♦ పాభిజాత్య
తే. విమలగుణసమృద్ధి ♦ వెలుఁగుచు సురసిద్ధ
సాధ్యకన్యలట్టి ♦ సఖులు నూర్వ

రొలసి తన్నుఁ గొలుచు ♦ చుండఁగ మహినొప్పు
చుండె నధిక విభవ ♦ యుక్తితోడ 8

టీ. అటన్ = అక్కడ (మఱియొక దేశమున) విశ్రుతగుణఆఢ్యుఁడు = ప్రసిద్ధములైన సుగుణములతోఁ గూడినవాఁడగు, విదర్భ అధిపుఁడు=విదర్భ దేశపురాజు, ఐన, భీముఁడు, అనువాఁడు; అనపత్యుఁడు = సంతతిలేని వాఁడు, ఐ, వ్రతములు=నోములు, ఓలిన్ = క్రమముగా, సల్పుచున్ = చేయుచు; దమనుండుఅను సన్మునిన్=మునిశ్రేష్ఠుని; పత్నియు = భార్యయు; తానును; ఉపాసించి=కొలిచి; తత్ వరమునన్ = ఆదమనముని యనుగ్రహము వలన, దమయంతి; అనుజాతును= పుత్రికను; దమదాంతదమనులు; అన్ సుతులన్=కొడుకులనుపడసెన్=కనెను; అందున్=ఆబిడ్డలలో,కన్యారత్నము=కన్యకలలో శ్రేష్ఠురాలు, అగుదమయంతి,తాను, అత్యంత...సమృద్ధిన్– అత్యంత= మేరలేని, కాంతి = చక్కఁదనము; రూప = ఆకారము; అభిజాత్య = గొప్ప కులమునందుఁబుట్టుటయును; విమలగుణ = నిర్మలములగు గుణములయొక్క; సమృద్ధిన్ = కలిమిచేత; వెలుఁగుచున్ = ప్రకాశించుచు; సురసిద్ధసాధ్య కన్యలట్టిసఖులు=దేవతలయొక్కయు, సిద్ధులయొక్కయు, సాధ్యులయొక్కయు, కన్యలఁబోలు చెలికత్తెలు; ఒలసి=చుట్టుకొని, తన్నున్, కొలుచుచుండన్; అధికవిభవయుక్తితోడన్=ఎక్కువ సంపదతోడి కూడికతో (మిగుల వైభవముతో); మహిన్ = భూమియందు; ఒప్పుచుండెన్ = ప్రకాశించుచుండెను.

క. నలుగుణములు దమయంతికి

నలునకు దమయంతి గుణగ ♦ ణంబులు జను లి
మ్ములఁ బొగడుట నిరువురకును
వెలసె మనోభవ వికార ♦ విభ్రమ మొదలన్ . 9

టీ. నలుగుణములు = నలమహారాజు సుగుణములు; దమయంతికిన్, నలునకున్, దమయంతి గుణగణంబులు = దమయంతియొక్క మంచిగుణముల సముదాయములును, జనులు, ఇమ్ములన్ = బాగుగా, పొగడుటన్, ఇరువురకున్, ఎదలన్ = మనస్సులయందు, మనోభవవికారవిభ్రమము = మన్మథవికారచేష్ట, వెలసెన్ = ప్రకాశించెను.

వ. ఒక్కనాఁడు నలుండు దమయంతీగుణబద్ధచేతస్కుండై మదనానలంబు సహింపనోపక ప్రమదావనంబున నుండు నంత నంతరిక్షశ్రీకాంతహారావళియుంబోలె హంసావళి యవనీతలంబున కవతరించిన. 10

టీ. ఒక్కనాఁడు, నలుఁడు, దమయంతీ=దమయంతియొక్క, గుణ=సుగుణములనెడి, త్రాళ్ళచేత, బద్ధ = కట్టబడిన, చేతస్కుండై = మనస్సుగలవాఁడై, మదన అనలంబు = మన్మథాగ్నిని, సహింపన్, ఓపక = ఓర్వఁజాలక, ప్రమదావనంబునన్ = ఉద్యానవనమునందు; ఉండునంతన్ = ఉండఁగా, అంతరిక్షశ్రీకాంతాహారావళియున్ పోలెన్ = ఆకాశలక్ష్మియనెడు స్త్రీయొక్క ముత్యాలదండలవరుసయో అనునట్లు; హంస ఆవళీ = హంసలగుంపు, అవనీతలంబునకున్ = పుడమికి, అవతరించినన్ = దిగఁగా.

ఆ. వీరసేనసుతుఁడు ♦ వీరుఁడు హంసల
నడబెడంగుఁ జూచి ♦ నగుచు వాని
నెగిచి యెగిచి యంత ♦ నెగయకుండఁగ నొక్క
హంసఁ బట్టుకొనియె ♦ నతిరయమున. 11

టీ. వీరుఁడు = శూరుడయిన, వీరసేనసుతుఁడు = వీరసేనుని కుమారుఁడగు నలుఁడు; హంసల, నడబెడంగున్ = నడకయొక్క అందమును, చూచినగుచున్ = ఆశ్చర్యపడుచు, వానిన్, ఎగిచి ఎగిచి = తఱిమితఱిమి,

అందున్ = ఆహంసలలో, ఒక హంసను, ఎగయక ఉండఁగన్ =ఎగిరిపోక యుండఁగా, అతిరయమునన్ = కడువడితో, పట్టుకొనియె.

ఆ. దాని విడిచి పోవఁ ♦ గా నోప కఱచుచు ×
నంతరిక్షమునను హంసలెల్లఁ
బిండుగట్టి తిరుగు ♦ చుండె(వాతోద్ధూత
శారదాభ్రశకల ♦ చయముఁబోలె.) 12

టీ. దానిన్ = ఆహంసను, విడిచిపోవఁగాన్, ఓపక = ఇష్టపడక, అఱచుచున్, అంతరిక్షమునన్ = ఆకాశమునందు, హంసలు ఎల్లన్=హంసలన్నియు, వాత = గాలిచేత; ఉద్ధూత = ఎగురగొట్టబడిన; శారద...ముఁబోలెన్ - శారద=శరత్కాలమందలి, అభ్ర=మేఘములయొక్క, శకల= తునుకలయొక్క, చయముఁబోలెన్ = సమూహమువలె; పిండుకట్టి = గుంపుగూడి, తిరుగుచుండెను.

వ. అదియును దనకమ్మనుజేశ్వరుం డపాయంబు సేయునకాఁ దలఁచి వెఱచి మనుష్యవాక్యంబుల నిట్లనియె నయ్యా యేను నీకుం బ్రియంబు సేసెద నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికిఁబోయి నీగుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయందు బద్ధానురాగ యగునట్లు చేసెద. 13

టీ. అదియున్ = ఆపట్టుపడినహంసయు; తనకు, అమ్మనుజేశ్వరుండు = ఆనరపాలుఁడు; అపాయంబు = కీడు; చేయునుఅకా=చేయునుగదా అని తలఁచి; వెఱచి=భయపడి; మనుష్యవాక్యములన్, ఇట్లు, అనియెన్ అయ్యా; ఏను = నేను, నీకున్; ప్రియంబు = ఇష్టమయిన కార్యమును;

చేసెదను; నీ హృదయఈశ్వరి=నీప్రాణవల్లభ, ఐన, దమయంతిపాలికిన్= దమయంతి యొద్దకు, పోయి, నీగుణంబులు, వానికిన్; వర్ణించి; చెప్పి,ఆకన్య = ఆ పడుచు; అన్యులన్ = ఇతరులను; అపేక్షింపక; నీయందున్ ఏ = నీయందే; బద్ధ = ఉంచబడిన; అనురాగ = ప్రేమగలది; అగునట్లు, చేసెదన్.

క. అనిన విని హంసవచనముఁ
దనహృదయంబునకు నమృత ♦ ధారాపాతం
బునుబోలె నైన నృపనం
దనుఁ డనురక్తుండయి విడిచెఁ ♦ దడయక దానిన్. 14

టీ. అనినన్; విని; హంసవచనము = హంసయొక్కమాట; తనహృదయంబునకున్ = తనమనస్సునకు; అమృతధారాపాతంబునుం బోలెన్ = అమృతధారపడినట్లు; ఐనన్; నృపనందనుండు = రాకొమరుఁడు; అనురక్తుఁడు = ప్రేమగలవాఁడు; దానిని; తడయక = ఆలస్యము చేయక; విడిచెను.

వ. హంసపిండుతో నదియును విదర్భాపురంబునకుఁ బఱచి యందుపవనంబున సఖీజనపరివృతయై యున్న దమయంతి పాలికిఁ బోయి విహరించుచుండె నంత నాహంసలం జూచి పరమకౌతుకంబున. 15

టీ. హంసపిండుతోన్ = హంసలగుంపుతో, అదియును, విదర్భాపురికిన్=విదర్భయనెడు పట్టణమునకు, పఱచి =ఎగిరిపోయి, అందు, ఉపవనంబునన్ = తోఁటలో, సఖీజనపరివృతఐ = చెలికత్తియలతోఁ గూడినదయి, ఉన్న దమయంతిపాలికిన్ = దమయంతి దగ్గరకు, పోయి, విహరించుచుండెన్ = తిరుగులాడుచుండెను. అంతన్, హంసలన్, చూచి, పరమ కౌతుకంబునన్ = మిక్కిలి సంతోషముతో, పైపద్యముతో నన్వయము.

తే. ఒండొరులఁ గడవంగ న ♦ య్యువిద లెల్లఁ
బఱచి యొక్కొక్క కలహంసఁ ♦ బట్టుకొనినఁ
జెలువముగ నందు దమయంతి ♦ చేతఁ బట్టు
వడియె నలుచేత విడువంగఁ ♦ బడిన హంస. 16

టీ. ఒండొరులన్ = ఒకరినొకరు, కడవన్ కన్ = దాఁటునట్లు, ఆ ఉవిదలుఎల్లన్ = స్త్రీలందఱు, పఱచి, ఒక్కొక్క, కలహంసన్ = రాజహంసను = పట్టుకొనినన్, అందున్ = ఆహంసలలోపల, నలుచేతన్, విడువంగఁబడినహంస=విడిచిపెట్టబడినహంస, చెలువముగన్ = అందముగా, దమయంతిచేతన్ = దమయంతి చేతిలో పట్టువడియెన్ = చిక్కెను.

క. దమయంతికి నలునకు సం
గమ కారణదూతయైన ♦ కలహంస మనో
జ్ఞ మనుష్యవాక్యముల న
ద్దమయంతికి హర్షమెసఁగఁ ♦ దానిట్లనియెన్. 17

టీ. దమయంతికిన్, నలునకున్, సంగమ = కూడికకు, కారణదూత= హేతువయినట్టి దూత, అయిన, కలహంస, మనోజ్ఞ = మనోహరమైన, మనుష్యవాక్యములన్ = మానవుల పలుకులతో, ఆదమయంతికిన్, హర్షము = సంతోషము, ఎసఁగన్ = ఎక్కువయగునట్లు, తాన్ = ఆహంస, ఇట్లు అనియెను.

వ. నీహృదయేశ్వరుం డయిన నలునొద్దనుండి వచ్చితి నపార పారావార పర్యంత మహీతలంబునందు నాచూడని రాజు లెవ్వరును లేరు. సర్వగుణ సౌందర్యంబుల నెవ్వరు నలుం బోలరు. 18

టీ. నీహృదయ ఈశ్వరుండు = నీప్రాణవల్లభుఁడు, ఐన నలునొద్ద నుండి, వచ్చితివి. అపార...మందన్ - అపార = అంతములేని, పారావార పర్యంత = సముద్రములవఱకునుండు, మహీతలంబునన్ = పుడమియందు, నాచూడని రాజులు = నేను చూడని రాజులు, లేరు, సర్వగుణ=అన్నిగుణ ములందును, సౌందర్యంబులందున్ = అందమునందును, ఎవ్వరు, నలున్, పోలరు = సాటిరారు.

తే. నీవు నలునకుఁ బేర్మితో ♦ దేవి వైనఁ
గాక నీసముజ్జ్వలరూప ♦ కాంతివిభవ
నిత్యసౌభాగ్య భాగ్యాభి ♦ జాత్యభద్ర
లక్షణావళు లవి సఫ ♦ లంబు లగునె. 19

టీ. నీవు, నలునకున్, పేర్మితోన్ = గొప్పతనముతో, దేవివి = పట్టపురాణివి, ఐనన్ కాక = అయిననే కాని, నీ...వళులు-అవి, నీ = నీ యొక్క, సముజ్జ్వల = ప్రకాశవంతమయినట్టి, రూప = ఆకారము, కాంతి= అందము, విభవ = సంపద, నిత్య = శాశ్వతమైన, సౌభాగ్యభాగ్య=అదృ ష్టము, అభిజాత్య = గొప్పవంశమునందుఁ బుట్టుక, భద్రలక్షణ = శుభలక్ష ణములు, అనునీయొక్క, ఆవళులు = సమూహములు, సఫలంబులు = సార్థకములు, అగునె? = అవునా ?

వ. నీవు నారీరత్నంబ వతఁడు పురుషరత్నంబు మీయిద్దఱ సమాగమం బన్యోన్యశోభాకరం బగుననిన విని సంతృప్త హృదయ యయి దమయంతి దాని కిట్లనియె. 20

టీ. నీవు, నారీరత్నంబవు = స్త్రీలలో శ్రేష్ఠురాలవు, అతండు, పురుష శ్రేష్ఠుఁడు = పురుషులలో నుత్తముఁడు, మీయిద్దఱ సమాగమంబు = మీ యిద్దఱికూడిక, అన్యోన్యశోభాకరంబు = ఒండొరులకుఁ గాంతిని గలిగించు

నది, అగును, అనినన్, విని, సంతృప్తహృదయయై = సంతోషము జెందిన మనస్సుగలదై, దమయంతి, దానికిన్, ఇట్లు, అనియె,

మధ్యాక్కర. ఆరాజుగుణములు నాకు నెఱిఁగించినట్టులనన్ను
నారాజునకు నెఱిఁగించి కరుణ నా నాయందుఁ గావింపు
మారంగ ననవుడు నిషధదేశంబున కరిగి హంస
వీరసేనజునకు దానిగుణరూప విభవముల్ సెప్పె. 21

టీ. ఆరాజుగుణములు, నాకున్, ఎఱిఁగించినట్టుల = తెలియఁజేసి, నటులే, నన్నున్, ఆరాజునకున్, ఎఱిఁగించి, ఆరంగన్ = నిజముగా, కరుణ = దయ, నాయందున్, కావింపుము, అనవుడున్ = అనియిట్లు, చెప్పఁగా, నిషధదేశమునకున్, అరిగి = వెళ్ళి, వీరసేనజనకున్ = వీరసేనుని కుమారుడయిన నలునకు, దాని గుణరూప విభవముల్ = మంచిగుణముల యొక్కయు చక్కని రూపముయొక్కయు, ఆధిక్యతను చెప్పెను.

వ. అంత. 22

టీ. అంతన్=అంతట.

చ. నల దమయంతు లిద్దఱు మనఃప్రభ వానల బాధ్యమానలై
నలిపిరి దీర్ఘవాసరని శల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్మృదుమృణాలములన్ ఘనసారపాంసులన్
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్.23

టీ. నలదమయంతులు, ఇద్దఱు, మనఃప్రభవ అనల = మన్మథ సంతాప మనెడి వేఁడిమిచేత, బాధ్యమానలై = బాధింపఁబడినవారలై, విలసత్ = ప్రకాశవంతమైన, నవనందనంబులన్ = క్రొత్త యుద్యానవనంబులయందు, నలినదళంబులన్ = తామర తూండ్లచేతను, ఘనసారపాంసులన్ = కర్పూ

రపు ధూళులచేతను, చందనచర్చలన్ = గంధపుఁబూఁతలచేతను, చారు = మనోహరమైన, దీర్ఘవాసర నిశల్ = నిడివియైన రేలంబగళ్ళను, సలిపిరి = చేసిరి.

(తా. గంధపుబూతలు, తామరపువ్వులు తాపమును తగ్గించునవిగాన, వీని యుపచారముల పొందుచు ఒకరినొకరు స్మరించుకొనుచు రేబవళ్ళు గడపిరని తాత్పర్యము.)

వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణశ్రవణసంజాతప్రీతులై యుండు నంత నంతఃకరణ సంతతమనోజాత సంతాప వివర్ణ వదన యైనయాదమయంతిం జూచి భయసంభ్రమాక్రాంత హృదయులగుచు సఖీజనంబులెల్ల నక్కోమలి వృత్తాంతం బంతయు భీమున కెఱింగించి యిట్లనిరి. 24

టీ. ఇట్లు, ఇద్దఱు, అన్యోన్యరూపగుణ శ్రవణసంజాత ప్రీతులై = పరస్పర సుగుణముల వినుటచేఁబుట్టిన యనురాగముగలవారయి, ఉండునంతన్ = ఉన్నప్పుడు, అంతః...వదన — అంతఃకరణ = మనస్సునందు, సంతత = ఎడఁ తెగని, మనోజాత = మన్మథవికారమువలనఁ గలిగిన, సంతాప = వేడిమిచేత, వివర్ణ = కాంతిహీనమైన, వదన = మోముగలది, అయిన ఆదమయంతిన్, చూచి, భయ, దయులు, భయ = భయముచేతను, సంభ్రమ = తత్తరపాటు చేతను; ఆక్రాన్త = క్రమ్ముకొనఁబడిన, హృదయులు = మనస్సులుగలవారు, అగుచున్, సఖీజనంబులు ఎల్లన్ = చెలికత్తెలందఱు, ఆకోమలివృత్తాంతంబు = ఆ స్త్రీయొక్క సమాచారము, అంతయున్, భీమునకున్ = దమయంతి తండ్రికి, ఎఱింగించి, ఇట్లు, అనిరి.

సీ. కలహంస పలికిన ♦ పలుకులు గణియించు
మఱి దానిపోయిన ♦ వలనఁ జూచుఁ
బలుకదు సఖులతో ♦ లలితాంగి మిన్నకే
యాలయుచునుండుఁ దా ♦ ననుదినంబు
చారువిభూషణా ♦ హార విహార శ
య్యాసన భోగంబు ♦ లందు విముఖ
యయి రేయి పగలు ని ♦ ద్రయు నెప్పుడెఱుఁగక
దమయంతి నలుఁడను ♦ ధరణినాథు
తే. నంద బుద్ధి నిలిపి ♦ కందర్ప బాధిత
యగుచు నున్నయది ధ ♦ రాధి నాథ!
ధరణిపతుల నోరుల ♦ నురుగుణాఢ్యుల విన
నొల్లదెంత విభవ ♦ యుక్తులైన. 25

టీ. ధర అధినాథ = భూపతీ, లతాంగి = తీఁగవంటి శరీరము గలది యగు, కలహంస, పలికిన పలుకులు, గణియించుచున్ = ఎంచుచు, వడిన్ = వేగముగా, దాని పోయినవలను = ఆహంస వెళ్ళినదిక్కునకే, చూచున్, సఖులతోన్ = చెలికత్తెలతో, పలుకదు, తాను, అనుదినంబు = ప్రతిదినమును, చారు విభూషణ ఆహార విహార శయ్యా ఆసన భోగంబులందున్ = సొగసైన సొమ్ములుదాల్చుట, మంచి భోజనము చేయుట, వేడుకయిన ఆటలాడుట, మెత్తని పాన్పులందుఁ బరుండుట యనుమంచి సౌఖ్యము లనుభవించుట యందు; విముఖియై = ఆసలేనిదై, రేయిపగలున్ = రాత్రియందును, పగటియందును; నిద్రయున్. ఎప్పుడును, ఎఱుఁగక, దమయంతి, నలుఁడు, అను ధరణీ నాథునందున్ = ఆరాజునందే, బుద్ధి, నిల్పి, కందర్పబాధిత = మన్మథునిచే, నొచ్చినది, అగుచున్, ఉన్నయది, ఉరుగుణ ఆఢ్యులన్ = గొప్ప

సుగుణములచే నిండినవారగు, ఒరులన్=ఇతరులైన, ధరణీపతులన్ = భూనాధులను, (వారు) ఎంత విభవయుక్తులు = ఎంత సంపదగలవారు, ఐనన్, వినన్, ఒల్లదు=ఇష్టపడదు.

వ. అనిన విని భీముం డేమిసేయుదు నెవ్విధంబున నమ్మహీపతి నిట రావింప నగునో యని చింతించుచు సంప్రాప్త యౌవనయైన కూఁతుఁజూచి యప్పుడు. 26

టీ. అనినన్, విని; భీముఁడు=భీమరాజు, ఏమి, చేయుదును; ఎవ్విధం, బునన్ = ఏరీతిగా, అమ్మహీపతిన్ = ఆ నలమహారాజును, ఇటకున్ = ఇచ్చటికి, రావింపన్, అగున్ ఓ = వచ్చునట్లు చేయనగునో అని, చింతించుచున్ = విచారించుచు, సంప్రాప్తయౌవన = వయసువచ్చినది, ఐన, కూఁతున్ = కూతురగు దమయంతిని, చూచి, అప్పుడు.

క. ఆవైదర్భుఁడు నిఖిల ధ
రావలయములోనఁ గలుగు ♦ రాజన్యుల నా
నా విషయాధీశ్వరులను
రావించెన్ దత్స్వయంవర ♦ వ్యాజమునన్. 27

టీ. ఆవైదర్భుఁడు =ఆవిదర్భదేశాధిపతి; నిఖిలధరావలయములోనన్, సమస్త భూమండలమునందు, కలుగు = కల, రాజన్యులన్ = ఇతర రాజులను, నానావిషయఅధీశులన్ = అన్నిదేశముల రాజులను, తత్ = ఆదమయంతియొక్క, స్వయంవరవ్యాజమునన్ = స్వయంవరమనెడి నెపముచేత, రావించెను=రప్పించెను.

క. మనుజేశ్వరు లెల్లను బో
రన దమయంతీ స్వయంవ ♦ రమునకు నొప్పన్
జనుదెంచిరి సైన్యస్యం
దన ఘట్టన నవనితలము ♦ తల్లడపడఁగన్. 28

టీ. మనుజ ఈశ్వరులు=ధరణీపతులు, సైన్య స్యందనముల్ చేసన్ = సేనలయొక్కయు, రథములయొక్కయు, త్రొక్కుడుచేత, అవనితలము = పుడమి, తల్లడపడన్ = అదురునట్లు, బోరన = వేగముగా, దమయంతీ స్వయంవరమునకున్, ఒప్పన్ = బాగుగా, చనుదెంచిరి = వచ్చిరి.

వ. తత్సమయంబునఁ బర్వతనారదులను పురాణమునులు భూలోకంబెల్లం గుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నిం దుఁడు వారింబూజించి భూలోకంబున కుశలవార్తయడిగి యిదియెట్లు ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహతులైన రాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథులై యిం దుల కెంతకాలంబయ్యె రానికారణంబేమి యనిన నయ్యిం ద్రునకు నారదుం డిట్లనియె. 29

టీ. తత్సమయంబునన్ = ఆరాజులందఱు దమయంతీ స్వయంవరము నకు వచ్చువేళ, పర్వతనారదులు = పర్వతుఁడు, నారదుఁడు (అను) పురాణ మునులు = పూర్వికులగు మహర్షులు, భూలోకంబు ఎల్లన్ = ప్రపంచమం తయు, క్రుమ్మరి = తిరిగి, ఇంద్రలోకంబునకున్, పోయినన్ = పోఁగా, ఇంద్రుఁడు, వారిన్, పూజించి, భూలోకంబునన్, కుశలవార్త = క్షేమ సమాచారము, ఇది, ఎట్లు = ఏలాగు ? ధర్మపరిపాలనపరులై = స్వధర్మమును గాపాడుటయం దాసక్తిగలవారై, వీరులు = శూరులు, ఐ, రణ హతులు ఐన = యుద్ధమునందు చనిపోయిన రాజులు, అక్షయలోకసుఖంబులు = శాశ్వతమైన స్వర్గలోకసౌఖ్యములను, అనుభవింపన్ = పొందుటకు, అతి థులై = విందులుగావచ్చినవారై, ఇందులకున్ = ఇచ్చటికి, ఎంతకాలంబు, అయ్యెను, రానికారణంబు, ఏమి, అనినన్, అయ్యింద్రునకున్=ఆఇంద్రునకు, నారదుండు, ఇట్లనియె.

క. నరసిద్ధసాధ్య విద్యా
ధరసుర కన్యకలకంటె ♦ దమయంతియ సుం
దరి దాని సుస్వయంవర
మరుదై వర్తిల్లుచున్న ♦ యది యిప్డు మహిన్. 30

టీ. నర...కన్యకలకంటెన్ = మనుష్యులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, దేవతలు మొదలగువారి కన్యకలకన్న దమయంతి ఆ = దమయంతియే, సుందరి=అందకత్తె, ఇప్డు, మహిన్ = భూమియందు, దానిసుస్వయంవరము = ఆ దమయంతీదేవియొక్క మంచిదైన స్వయంవరము, అరుదై =ఆశ్చర్యకరమైనదై, వర్తిల్లుచున్నయది = ప్రవర్తించుచున్నది.

క. అందులకు ధరణిఁగల నృప
నందను లెల్లను ముదంబు ♦ నం బోయెదు వే
డ్కఁ దమలోఁ గయ్యమ్ములు
గ్రందుగ లేకున్నవారు ♦ గడు నెయ్యమునన్. 31

టీ. అందులకున్ = ఆస్వయంవరమునకై, ధరణిన్ = పుడమియందు, కల, నృపనందనులు = రాజకుమారులు, ముదంబునన్ = కుతూహలముతో, పోయెదు వేడ్కన్ = వెళ్ళునట్టి యుత్సాహముతో, తమలోన్, కడు = మిక్కిలి, నెయ్యమునన్ = స్నేహముచేత, కయ్యమ్ముల = యుద్ధములు, క్రందుగన్ = తఱచుగా, లేకున్నవారు = లేకయున్నవారు.

వ. అనిన విని యింద్రుండును లోకపాలవరులును దదాలోకన కౌతుకంబునం గనకరత్నరమ్యవిమానారూఢులై భూలోకంబునకు వచ్చి దమయంతీస్వయంవరమునకుం బోయెడు వాని నాదిత్యులలోన విష్ణుండునుంబోలెఁ దేజోధికుండైన వాని ననన్య సాధారణరూప విభవంబున రెండవ మన్మ

థుండునుం బోనివాని నలుం గని యంతరిక్షంబున విమా
నంబులు నిలిపి భూతలంబునకువచ్చి వాని కిట్లనిరి. 32

టీ. అనినన్, విని, ఇంద్రుఁడును, లోకపాలవరులును = దిక్పతు
లలోఁ శ్రేష్ఠులగువారు, (యమ, వరుణ, కుబేరులు) తత్ ఆలోకనకౌతుకంబు
నన్ = ఆదమయంతియొక్క (ని) చూచు వేడుకతో, కనక...థులై - కనక=
బంగారముతోఁ జేయఁబడి, రత్న = రత్నములచేఁబొదుగఁబడినవై, రమ్య=
అందములైన, విమాన = ఆకాశయానములను, అరూఢులు = ఎక్కినవారు,
ఐ, భూలోకంబునకున్, వచ్చి, దమయంతీస్వయంవరమునకున్, పోయెడు
వానిన్ = పోవువానిని, ఆదిత్యులలోపలన్ = సూర్యులలోపల, విష్ణుండు
నుంబోలెన్ = విష్ణువనువానివలె, తేజన్ అధికుండయినవానిని = ఎక్కువ
గాఁ బ్రకాశించువానిని, అనన్య...విభవంబునన్ - అనన్యసాధారణ = ఇత
రులకు సాధ్యముగాని, రూపవిభవంబునన్ = సౌందర్యాధిక్యముచేత, రెండవ
మన్మథుండునుంబోనివానిని = రెండవ మన్మథుఁడాయేమి యనఁదగువాని
నలున్ = నలమహారాజును, కని = చూచి, అంతరిక్షంబునన్ = ఆకసమున
విమానంబులు; నిలిపి, భూతలంబునకు, వచ్చి, వానికి, ఇట్లు, అనిరి.

సీ. నిత్య సత్యవ్రత ♦ నిషధేశ ! నీవు మా
కమరంగ దూతవై ♦ యభిమతంబు
సేయుము నావుఁడుఁ ♦ జెచ్చెర నట్టుల
చేసెద మఱినాకుఁ ♦ జెప్పుఁడ మీర
లెవ్వార లేను మీ ♦ కిష్టంబుగా దూత
నై యేమిసేయుదు ♦ ననిన నతని
కమరేశ్వరుం డిట్టు ♦ లనియె నే నింద్రుండ
వీరు దిక్పాలురు ♦ విదితయశులు

ఆ. ధరణి నొప్పుచున్న ♦ దమయంతి సుస్వయం
వరముఁ జూచువేడ్క ♦ వచ్చియున్న
వార మీవు మమ్ము ♦ వారిజాక్షికి నెఱిం
గింపు నామధేయ ♦ కీర్తనముల. 33

టీ. నిత్యసత్యవ్రత = శాశ్వతమైన సత్యమే వ్రతముగాఁ గలవాఁడా నిషధఈశ = నిషధరాజా, నీవు, మాకున్, అమరంగన్ = ఒప్పునట్లు, ఐ, అభిమతంబున్ = చేయుఇష్టమును, నావుడున్ = అనియిట్లు చెప్పఁగా, చెచ్చెరన్ = శీఘ్రముగా, అటులజేసెదను. మఱిన్, నాకున్, చెప్పఁడు అ= చెప్పుడు, మీరలు, ఎవ్వారలు= ఎవ్వరు, ఏను, మీకున్, ఇష్టఁబుగాన్, దూతను, ఐ, ఏమి, చేయుదును, అనినన్, అతనిన్, అతనికిన్ = అ నలునకు, అమరేశ్వరుఁడు,=దేవేంద్రుఁడు, ఇటులు, అనియెన్, నేను, ఇంద్రుండను, వీరు, దిక్పాలకులు = దిక్కులనేలువారు, విదిత = ప్రసిద్ధికెక్కిన యశులు = కీర్తిగలవారు, ధరణిన్ = భూమియందు, ఒప్పుచున్న =బరగుచున్న, దమయంతి సుస్వయంవరమున్, చూచువేడ్కన్ = చూచుటిట్టి సంతోషముతో, వచ్చియున్నవారము, ఈవు, మమున్, నామధేయకీర్తనములన్ = పేరులు చెప్పుటచేత, ఎఱిగింపుము = తెలియఁజేయుము.

వ. అట్లైన నకోమలి మాయందుఁ దన వలచువాని వరియించుననిన నింద్రునకుఁ గృతాంజలియయి నలుండిట్లనియె.

టీ. అట్లు, ఐనన్, ఆకోమలి = ఆస్త్రీ (దమయంతి) మాయందున్= మాలో, తనవలచువానిన్ = తానిష్టపడినవానిని, వరించున్ = కోరును

ఇందుఁ బ్రినకున్, నలుఁడు, కృత అంజలి ఐ =చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై, ఇట్లు, అనియెన్.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను ♦ నేకార్థసమవేతుఁ
బాడియయ్యె యిట్టి ♦ పనికిఁ బనుప
ననిన నుత్సుకుండ ♦ వై యేల చేసెద
నంటి చేయకుండ ♦ నగునె నీకు. 35

టీ. నన్నున్, ఏకార్థసమవేతున్ = ఒక్క ప్రయోజనముతో కూడిన వానినిగా; ఎఱిఁగిఎఱిఁగి = తెలిసి తెలిసి, ఇట్టిపనికిన్, పనుపన్ = పంపుట పాడిఅయ్యె = న్యాయమయ్యె, అనినన్, ఉత్సుకుండవై = వేడుకతోఁ గూడినవాఁడవై, ఏల. చేసెదను, అంటివి, నీకు, చేయకుండన్ = చేయక యుండుట, అగునే = అగునా, (తగదనుట)

ఆ. నిన్ను నిత్యసత్య ♦ నిరతుఁగా నెఱిఁగి యి
క్కార్యమునకు వలను ♦ గలుగు టెఱిఁగి
పనుపవలసె దూత ♦ భావ మపేక్షించి
దేవహితము దీనిఁ ♦ దీర్పవలయు. 36

టీ. నినున్, నిత్యసత్యనిరతున్ కాన్ = స్థిరమయిన సత్యము పలుకుట యందే కోరికగలవానిఁగా, ఎఱిఁగి, ఇక్కార్యంబునకున్ = ఈప్రయోజనము నకు, నేర్పుకలుగుట, ఎఱిఁగి, దూతభావము =దూతకృత్యము, అపేక్షించి = కోరి, పనుపవలసెన్ = పంపవలసివచ్చెను. దేవహితమున్ = దేవతల కిష్టము యిన, దీనిన్ = ఈపనిని, తీర్పవలయున్ = నెరవేర్పవలయును.

వ. అయుధీయసురక్షితంబైన రాజగృహంబెట్లు చొరనగునని శంకింపవలదు. దమయంతీ నివేశంబుఁ బ్రవేశించునపుడు

నిన్నెవ్వరు వారింప నోడుదురనిన శక్రువచనంబుల నశం
కితుండై నలుం డొక్కరుండ విదర్భాపురమునకుం బోయి
దమయంతి గృహంబు సొచ్చి, 37

టీ. ఆయుధీయసురక్షితంబు = ఆయుధములచే జీవనముచేయువారిచేఁ
జక్కఁగాఁ గాపాడఁబడినది, ఐన, రాజగృహంబె = రాజంతఃపురంబు, ఎట్లు
చొఱనగున్ = ప్రవేశింపవచ్చును, అని, శంకింపవలదు = సందేహపడనక్క
రలేదు. దమయంతీనివేశంబున్ = దమయంతియొక్క నివాసస్థానమును,
(ప్రవేశించునప్పుడు) నిన్నున్, ఎవ్వరు, వారింపన్ = అడ్డుపెట్టుటకు, ఓడు
దురు = చాలరు, అనిన, శక్రువచనంబులన్ = ఇంద్రునిమాటలచే, అశంకి
తుండై = సందేహము లేనివాఁడై, నలుండు, ఒక్కరుండ = ఒక్కఁడే,
విదర్భాపురంబునకున్ = విదర్భకు, పోయి, దమయంతి గృహంబు చొచ్చి=
దమయంతి యంతఃపురంబునఁ బ్రవేశించి.

సీ. హంసచేఁ దనవిని ♦ నంతకంటెను రూప
విభవాతిశయముల ♦ వెలయుదాని
సురకన్యకలయట్టి ♦ సురుచిరశతకన్య
కాళిచేఁ బరివృత ♦ యైనదాని
హృదయేశుఁ డైన త ♦ న్నెప్పుడు వినుచున్కి
నలయు కాశ్వాసిత ♦ యైనదాని
దమయంతిఁ జూచి కం ♦ దర్పశరావిద్ధుఁ
డయ్యె నలుం డంత ♦ నతనిఁ జూచి
ఆ. యితఁ డపూర్వమనుజుఁ ♦ డెందుండి వచ్చెనో
యనుచు నదరిపడి ల ♦ తాంగు లెల్ల

నాసనముల డిగ్గి ♦ యపుడు ప్రత్యుద్గత
లై రి మనములందు ♦ హర్షమెసఁగ. 38

టీ. హంసచేన్ = హంసవలన, తనవినినంతకంటెన్=తానువిన్నదాని కన్న, రూప=సౌందర్యముయొక్క,విభవఅతిశయములన్ = సంపదలయొక్క అధిక్యములతో, వెలయుదానిన్=ప్రకాశించుదానిని,సురకన్యకలయట్టి=దేవతా స్త్రీలవంటి, సురుచిరశతకన్యకాళిచేన్=మిక్కిలి యందగత్తెలైన నూర్వురు పడుచులగు చెలికత్తియలచే, పరివృత ఐనదానిని = చుట్టుకొనఁబడినదానిని, హృదయేశుఁడు=తన మనోవల్లభుండు, ఐన, తన్నున్ (నలుని పేరును అనుట) ఎప్పుడున్ వినుచున్కన్=వినుచుండుటచేత, అలయక=ఆయాసపడక, ఆశ్వాశిత ఐనదానిని=ఊఱటనొంది యుండునదియునైన; దమయంతిని, చూచి, నలుండు, కందర్పశర ఆవిద్ధుఁడు=మరుబాణములచేఁ గొట్టఁబడినవాఁడు, అంతన్, అతనిన్, చూచి, ఇతండు, అపూర్వమనుజుఁడు=క్రొత్తపురుషుఁడు ఎందుండి = ఎక్కడనుండి, వచ్చెనో, అనుచున్, ఆదిరిపడి = ఉలికిపడి, అపుడు లతాంగులు ఎల్లన్ = స్త్రీలందఱు, ఆసనంబులను = తముకూర్చున్న పీఠముల నుండి, డిగ్గి=దిగి, మనంబులందున్ = మనస్సులయందు, హర్షము=సంతోషము, ఎసఁగన్=అతిశయింపఁగా, ప్రత్యుద్గతులు=ఎదురొక్కనినవారు, ఐరి.

క. దమయంతి మనోభవనిభు
నమరేంద్రప్రతిము దినక ♦ రాభు సుధారు
క్సము వరుణసదృశు ధనదో
పము నశ్విసమాను నిషధ ♦ పతిఁ జూచి నలున్. 39

టీ. దమయంతి, మనోభవవిభున్ = (సౌందర్యమందు) మన్మథునితో సముఁడును, అమర ఇంద్రప్రతిమున్ = (పరాక్రమమందు) దేవేంద్రునితో సమానుఁడును, దినకరఆభున్ = (ప్రతాపమందు) సూర్యునితో సాటియైన వాఁడును, సుధారుక్సమున్ = (సంతోషమును గలిగించుటయందు) చంద్రు

నితోఁ సమానుఁడును, వరుణసమున్ = (దయయందు) వరుణునిఁ బోలువాఁడును, (భాగ్యమునందు) ధనదోపమున్ = కుబేరునితోఁ బోటియగువాఁడును, అశ్విసమానున్ = (చక్కఁదనమున) నశ్వినీదేవతలతో నీడైనవాఁడును, ఐన, నిషధపతిన్ = నిషధ దేశాధీశ్వరుఁడగు, నలున్, చూచి.

క. వారిరుహనేత్ర మదన
ప్రేరితయై లజ్జ యుడిగి • భీతిల్లక బృం
దారకమూర్తికి రాజకు
మారున కిట్లనియె మంద • మందమృదూక్తిన్. 40

టీ. వారిరుహనేత్ర=కమలములవంటి కన్నులుగల దమయంతి, మదనప్రేరితయై = మన్మథునిచే బురికొల్పఁబడినదై, లజ్జయుడిగి = సిగ్గువదలి; భీతిల్లక = భయపడక; బృందారకమూర్తికిన్ = దివ్యశరీరముగలవాఁడగు; రాజకుమారునకున్ = రాకుమారునకు (నలునకు) మందమంద మృదూక్తిన్ = మిక్కిలి నెమ్మదియైన అందమయినమాటలతో, ఇట్లు, అనియెన్.

వ. నీవు మహానుభావుండ విందుల కేమికారణంబున నేకతంబ వచ్చితి విది యత్యుగ్రశాసనుండైన మదీయ జనకుచేత సురక్షితం బగుట నెవ్వరికిం జొర నశక్యంబు, దీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునం జొచ్చితి, నాకు మనోవేదనా వివర్ధనుండవైన నీ తెఱం గెఱింగింపు మనిన దానికి నలుం డిట్లనియె. 41

టీ. నీవు మహానుభావుఁడవు = ఎక్కువమహిమగలవాఁడవు, ఇందులకున్ = ఇచ్చటికి, ఏమికారణంబునన్ = ఏహేతువుచేత, ఏకతంబు ఆ = ఒంటరిగా, వచ్చితివి; ఇది = ఈయంతఃపురము; అత్యుగ్రశాసనుండు = మిక్కిలి తీవ్రముగా దండించువాఁడు, ఐనమదీయజనకుచేన్ = ఐన నా తండ్రి

రచేత; సురక్షితంబు = చక్కఁగా గాపాడునది, అగుటచేన్, ఎవ్వరికిన్, చొఱన్ = ప్రవేశించుటకు, అశక్యంబు = అసాధ్యము,గాదు, దీనిన్ = ఈయంతఃపురంబును; ఎవ్వరు; ఎఱుంగకుండఁగ = తెలిసికొనకుండఁలాగున, చొచ్చితివి = ప్రవేశించితివి. నాకుఁగ, మనోవేదనావివర్ధనుండవు = మనస్సులోని పరితాపమును హెచ్చఁజేయువాఁడవయిన; నీ తెఱఁగు = నీప్రకారము, ఎఱిగింపుము; అనిఁగ, దానికిఁగ, నలుఁడు, ఇట్లు, అనియెఁగ.

ఆ. ఏను దేవదూత ♦ నింతి! నలుండను
వాఁడ నింద్రధనద ♦ వరుణ యములు
నీస్వయంవరంబు ♦ నెమ్మితోఁ జూడంగ
నరుగుదెంచి నన్ను ♦ నబల మున్న. 42

క. నీయొద్దకుఁ బుత్తెంచిరి
మాయం దొక్కరుని నిష్ట ♦ మతి వరియింపఁగ
దోయజముఖిఁ బ్రార్థింపుము
మాయందఱ ప్రియము ♦ మొనర్పు ♦ మా సంప్రీతిన్. 43

42 – 43. టీ. ఇంతి = ఓదమయంతీ! ఏను, దేవదూతను, నలుఁడు, అనువాఁడను, ఇంద్ర ధనద వరుణ యములు = దేవేంద్రుఁడు, కుబేరుఁడు, వరుణుఁడు, యముండును, నీస్వయంవరమున్, నెమ్మితో = ప్రియముతో, చూడంగన్ = చూచుటకు, అరుగుదెంచి = వచ్చి, అబల = ఓచిన్నదానా (ధైర్యము లేనిదానా) నన్ను, మున్ను = ముందుగా, నీ యొద్దకుఁగ, పుత్తెంచిరి = పంపిరి, మాయందుఁగ = మాలోపల, ఒక్కరుని = ఒకనిని ఇష్టమతిన్_అపేక్షగల బుద్ధితో, వరియింపఁగ = కోరుటకు. తోయజముఖిన్ = తామరపువ్వువంటి మొగము గల యీదమయంతిని, ప్రార్థింపుము, మాయందఱప్రియము = మాయందరి కోరికను, సంప్రీతిన్ = ఇష్టముతో, ఒనర్పుము అ = చేయుముసుమీ.

వ. అని పంచినం దత్ప్రభావంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి నింద్రాదులకుం బ్రియంబు సేయుమనిన నవనత వదనయై దమయంతి తొల్లి హంసచేత నలువిని వానియంద బద్ధానురాగయయి నవయుచున్నయది యపుడతని నెఱింగి తద్వచనశ్రవణదుఃఖాయమానమానసయగుచు నిట్లనియె.

టీ. అని, పంచినన్ = పంపఁగా, తత్ప్రభావంబునన్ = వారిమహిమ చేత; అలక్షితుండనై = ఎవ్వారికిని గనబడకుండనివాఁడనై; వచ్చితిని, ఇంద్రాదులకున్ = దేవేంద్రుఁడు మొదలగు వారియొక్క, ప్రియంబు = ఇష్టమును, చేయుము = నెఱవేర్పుము, అనినన్, దమయంతి, అవనతవదన ఐ = తలవంచుకొనినది ఐ; తొల్లి = మునుపు, హంసచేతన్ = హంసవలన, నలున్ = నలుని (సుగుణసంపత్తినిగూర్చి) విని, వానియందున్ అ = ఆనలునియందే, బద్ధ అనురాగ అయి = బంధింపబడిన ప్రేమగలదై, నవయుచున్నయది = కృశించిపోవుచున్నది, అపుడు, అతనిని, ఎఱిఁగి = నలుఁడని తెలిసికొని, తద్వచనశ్రవణదుఃఖాయమాన మానస అగుచున్ — తత్ = ఆనలుని, వచన = మాటలయొక్క(ను) శ్రవణ = వినుటచే, దుఃఖాయమాన = దుఃఖము గలదగుచుండు, మానస అగుచున్ = మనసుగలదై, ఇట్లు, అనియెన్.

తరువోజ. ఏనెడ నింద్రాదు♦లేడ వారలకు♦ నెవ్వాడ మ్రొక్కు
దు♦ నేను నీధనమ, భూనాథ! నీగుణం♦బులు హంసచేతఁ♦బొ
లుపుగా వినిమనం♦బున నిల్పియున్న, దానభవన్నిమి♦త్తమున
నిట్టఖిలధారుణీనాథ సా♦ర్థంబు రావింపఁ, గా నిప్డువలసె
లో♦కఖ్యాతకీర్తి! ♦ కరుణించి పతిబుద్ధి♦గావింపుమిందు. 45

టీ. ఏను, ఏడన్=ఎచ్చోట, ఇంద్రాదులు=ఇంద్రుఁడు మున్నగువారు, ఏడన్=ఎక్కడ; వారలకున్, ఎప్పుడు, మ్రొక్కుదును=నమస్కరించుదును, నీధనము=నీసొమ్మయినదానను, భూనాథ=ఓరాజా, నీగుణంబులు=నీసుగుణంబులు, హంసచేతన్=హంసవలన, మనంబునన్, నిల్పియున్నదానను=ఉంచుకొనియున్నదానను, భవన్నిమిత్తంబునన్=నీవుఁచ్చుకొరకై, ఇట్లు, అఖిలధారుణీనాథసార్థంబు=సమస్తరాజులయొక్క సమూహమును, ఇప్పుడు, రావింపన్ కాన్ వలసెన్=వచ్చునట్లు జేయవలసి వచ్చెను, లోకఖ్యాతకీర్తి=జగమునందు ప్రసిద్ధిచెందిన యశస్సుగల యోనలుఁడా, కరుణించి=దయయుంచి, ఇందున్=ఈనాకు, పతిబుద్ధిన్=మగడనెడితలంపును, కావింపుము=చేయుము.

వ. నీవు దీని కొడంబడనినాఁడు రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణపరిత్యాగంబు సేసికొందు ననిన దానికి నలుం డిట్లనియె. 46

టీ. నీవు, దీనికిన్, ఒడంబడనినాఁడు=సమ్మతింపనిదినమున, రజ్జు...లంబులన్-రజ్జు=త్రాళ్ళచేతనో (ఉరిపోసికొనియో), విష=గరళముచేతనో, (విసముద్రావియో), అగ్ని=నిప్పుచేతనో (చిచ్చునదూకియో), జలంబులన్=నీటిచేతనో (నూయి మొదలగువానియందుఁ బడియో), ప్రాణపరిత్యాగంబు=ప్రాణములను విడిచిపెట్టుటను, చేసికొందును, అనిన, దానికిన్, నలుఁడు, ఇట్లు, అనియె.

మత్తకోకిల.

భూరిసత్త్వులు సర్వలోకవి♦భుల్ విభూతిసమృద్ధు లి
ద్ధోరుకీర్తులు నిన్నుఁ గోరుచు ♦ నున్నవా రమరోత్తముల్
వారిపాదరజంబుఁ బోలని ♦ వాని నన్ను మనుష్యు సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్ర♦సన్నులై సురలుండఁగాన్. 47

టీ. భూరిసత్త్వులు = ఎక్కువ బలిమిగలవారు, సర్వలోకవిభుల్ = అన్నిలోకములకుఁ బ్రభువులు, విభూతిసమృద్ధులు = ఐశ్వర్యము గలవారు, ఇద్ధ ఉరుకీర్తులు=ప్రసిద్ధికెక్కిన గొప్పపేరుగలవారయిన, అమరఉత్తముల్= దేవతాశ్రేష్ఠులు, నినుఁ, కోరుచున్నవారు, సురలు = దేవతలు, నీపైన్- ప్రసన్నులై = నీయెడఁ బ్రీతిగలవారయి, ఉండఁగాన్, వారి పాదరజంబున్- పోలనివానిన్=వారియొక్క పాదధూళితో సాటికానివానిని, మనుష్యున్ = మానవుని, సంసారిన్ =కుటుంబివి, కోరఁగన్=కోరుట, చన్నె=యుక్తమా?

క. దేవతల కప్రియంబులు
  గావించు మనుష్యు లధమ ♦ గతులగుదు రిలన్
  గావున వారికి నిష్టముఁ
  గావింపుము నన్నుఁ బ్రీతిఁ ♦ గావుము తరుణీ. 48

టీ. తరుణీ=ఓవనితా, దేవతలకున్ = వేల్పులకు, అప్రియంబులు = అనిష్టములు, కావించి = చేసి, మనుష్యులు, ఇలన్ = భూమియందు, అధమగతులు = నీచగతిగలవారు, అగుదురు. కావునన్ వారికిన్ = ఆదేవతలకు, ఇష్టము, కావింపుము = చేయుము, నన్నున్, ప్రీతిన్ = సంతోషముతో, కావుము = రక్షింపుము.

వ. అనిన దమయంతి నయనాంతర్గళిత బాష్పధారాకలితకపోలయుగళ యగుచుం బెద్దయుఁబ్రొద్దు చింతించి నీయభిప్రాయంబునకు నిరపాయం బైన యుపాయంబుఁ గంటి నింద్రాదులు నాస్వయంవరంబునకు వచ్చెదరేని వారి సన్నిధిన నిన్ను వరియించెద నట్లయిన నిర్దోషం బగుననిన నలుండు లోకపాలుర పాలికిం జని దమయంతి పలికిన విధంబుఁ జెప్పె నంతఁ బుణ్యతిథి నక్షత్రముహూర్తంబున దమయంతీస్వయంవరంబు ప్రవర్తిల్లిన. 49

టీ. అనినన్, దమయంతి, నయన, అంతర్గళిత బాష్పధారాకలితకపోల యుగళ-నయన = నేత్రములయొక్క, అంతః = లోపలినుండి, గళిత=జారిన, బాష్ప=కన్నీటియొక్క, ధారా=ధారలచే, ఆకలిత=అంతటనిండిన, కపోల= చెక్కిళ్ళయొక్క, యుగళ= జంటగలది, అగుచున్, పెద్దదియుఁ, ప్రొద్దు= చాలకాలము, చింతించి = యోచించి, నీయభిప్రాయంబుఁ‌కున్ =నీఆలోచనకు, నిరపాయంబు = అపాయములేనియట్టి, ఉపాయంబున్=తంత్రమును, కంటిని = తెలిసికొంటిని, ఇంద్రాదులు; నా స్వయంవరంబునకుఁ, వచ్చెదరేని = వచ్చినయెడల, వారిసన్నిధిని అ = వారియెదుటనే, నిన్నుఁ, వరియించెదను = కోరెదను, అట్లయినఁ, నిర్దోషంబు=దోషములేమి, అగును, అనినఁ, నలుండు, లోకపాలురపాలికిన్ = లోకపాలురవద్దకు, చని = వెళ్ళి, దమయంతి, పలికినవిధంబుఁ = చెప్పినవిధమున, చెప్పెను, అంతఁ = పిమ్మట పుణ్యతిథినక్షత్ర ముహూర్తమునఁ = మంగళప్రదమైన తిథి నక్షత్రములతోఁ గూడిన శుభముహూర్తమున; దమయంతీ స్వయంవరంబు, ప్రవర్తిల్లినఁ = జరుగఁగా.

ఆ. నలునకాని నలిన ♦ దళనేత్ర వరియింప
　దట్టె చూతమనుచు ♦ నమరవరులు
　నలువురును గడంగి ♦ నలరూపముల వచ్చి
　రాస్వయంవరమున ♦ కతిముదమున.　　50

టీ. నళినదళనేత్ర = తామరరేకులవంటి కన్నులుగలయాదమయంతి, నలుని ఆ కాని = నలునినే తప్ప, (ఇతరుల) వరియింపదు-అట్టె = వరియింపదంట, చూతముఁ, అనుచుఁ, అమరవరులు=దేవతలలో శ్రేష్ఠులు, నలువురును, కడఁగి = ప్రయత్నముతో, నలరూపములన్ = నలమహారాజు వేషములతో (గూడి), అతిముదమునన్ = మిక్కిలి సంతోషముతో, ఆస్వయంవరమునకున్, వచ్చిరి.

వ. అంత. 51

టీ. అంతఁ = ఈరీతిని ఇంద్రాదులందఱు రాఁగా.

సీ. దమయంతి సితపుష్ప ♦ దామాభిశోభిత
హస్తయై చనుదెంచి ♦ యంబుజాక్షి
యమ్మహోత్సవ దర్శ ♦ నాగత రాజన్య
నివహంబు నీక్షించి ♦ నెమ్మితోడ
నలువురు వేల్పులు ♦ నలుదొట్టి యప్పుడే
కాకారులై యున్న ♦ నందు నలుని
నేర్పరింపఁగ నేర ♦ కింద్రాదులను నలు
నెఱుఁగు నుపాయ మిం ♦ కెద్దియొక్కొ

ఆ. యనుచు సంశయాకు ♦ లాత్మయై సురలార
నలు నెఱుంగువిధము ♦ నాకుఁ జేయుఁ
డాత్మరూపధరుల ♦ రగుఁడని పరిదేవ
నంబు సేసెఁ దన మ ♦ నంబులోన. 52

టీ. అంబుజ అక్షి = కమలంబులంబోలు కన్నులుగలదగు, దమయంతి - సిత...హస్త ఐ-సిత=తెల్లనైన, పుష్పదామ = పుష్పములసరములచేత, అభిశోభిత=అంతటఁ నలంకరింపఁజేయఁబడిన, హస్త ఐ = చేయి గలదై (చేతియందుఁ దెల్లనిపూవులు గుచ్చినసరములు పట్టుకొన్నదై), చనుదెంచి = వచ్చి, అమ్మహో...నివహంబున్-అమ్మహోత్సవ=ఆస్వయంవరంబను వేడుకయొక్క, దర్శన=చూచుటకై, ఆగత=వచ్చిన, రాజన్య=రాజులయొక్క, నివహంబున్=గుంపును, నెమ్మితోడఁ = ప్రీతితో, ఈక్షించి = చూచి, నలువురు వేల్పులు=ఇంద్ర యమ వరుణ కుబేరు లనెడి నలువురు దిక్పతులును, నలున్ జ

తోట్రి = పోలి(నలునివలె, అప్పుడు, ఏక ఆకారులు ఐ= ఒక్కటేయాకార ముగలవారై, ఉన్నన్, అందున్ = వారిలో, నలునిన్, ఏర్పరింపఁగన్ = తెలిసికొనుటకు, నేరక=చాలక, ఇంద్రాదులను=ఇంద్రుఁడు మొదలగువారిని, నలున్, ఎఱుంగు, ఉపాయము, ఇంకన్, ఎద్దిఒక్కొ = ఏదో, అనుచున్, సంశయ ఆకుల ఆత్మ ఐ = సంశయముచేఁ జీకాకుపడిన మనస్సుగలదై, సురలార = ఓ దేవతలారా, నలున్, ఎఱుంగువిధము, నాకున్, చేయుఁడు= తెలియఁజెప్పుడు. ఆత్మరూపధరులరు =నిజరూపము ధరించినవారలు, అగుడు, అని తన మనములోనన్, పరిదేవనంబు, చేసెను, చింతించెను = యోచించెను.

వ. దేవతలు దాని పరిదేవనంబు విని కరుణించి యనిమిష
లోచనంబులు నస్వేదగాత్రంబులు నొప్ప నవనీతలంబు
ముట్టక యాసన్నులై నిలిచి రంత లోకపాలురు భూలో
కంబునం గల రాజలోకంబు నాలోకించుచుండఁ బుణ్య
శ్లోకుండయిన నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి
తదీయస్కంధంబున సుగంధికుసుమదామకంబు వెట్టిన. 53

టీ. దేవతలు, దానిపరిదేవనంబు = ఆదమయంతిదేవి మొక్క చింతను, విని, కరుణించి=దయగలిగి,అనిమిష లోచనంబులు—అనిమిష = రెప్పపాటులేని, లోచనంబులు = కన్నులును, అస్వేదగాత్రంబులును = చెమటగాఱని మేనులును; ఒప్పన్ = ప్రకాశింపఁగా; అవనీతలంబున్ = భూమిని, ముట్టక = తాఁకక; ఆసన్నులై = సమీపించి; నిలిచిరి. అంత, లోకపాలురను, భూలోకంబునన్; కల = ఉన్న; రాజలోకంబును=రాజులసముదాయమును, ఆలోకించుచుండన్ = చూచుచుండఁగా, పుణ్యశ్లోకుండు =పవిత్రమైనకీర్తిగల వాఁడు; అయిన; నలున్; ధర్మవిధానంబునన్ = శాస్త్రపద్ధతిని; వరియించి= కోరి; దమయంతి, తదీయస్కంధంబునన్ = ఆనలునిభుజమున; సుగంధి కుసుమదామకంబు పెట్టినన్ = కమ్మనితావిగల పూవులసరంబు వేయఁగా.

క. దేవతల సాధువాదము
తో విప్రాశీరవంబు ♦ తో బహుతూర్యా
రావంబులు చెలఁగెను బా
రావారరవంబుఁ బోలె ♦ ననివార్యంబై. 54

టీ. దేవతలసాధువాదములతోన్ = వేల్పులయొక్క బాగుబాగను ధ్వనులతో; విప్రఆశీరవంబుతోన్ = విప్రులయాశీర్వాదధ్వనులతో; బహుతూర్య ఆరావంబులు = పెక్కువాద్యములమ్రోఁతలు; పారావార రవంబుఁబోలెన్ = సముద్రముయొక్క ధ్వనివలె; అనివార్యంబుఐ = అడ్డు లేక; చెలఁగెను = రేఁగెను; అతిశయించెను.

వ॥ ఇట్లపూర్వస్వయంవరలబ్ధ యయిన దమయంతి నత్యంత విలాసంబుతో వివాహంబయిన యా నలునకు మెచ్చి యింద్రుండు వాని యజ్ఞంబులయందు నిజరూపంబుతో హవిర్భాగంబుఁ గొనను నగ్నియు వరుణుండును వాని వలసిన చోటన యనలోదకంబు లుత్పాదింపను ధర్ముండు వాని చిత్తంబు ధర్మువునంద వర్తిల్లను ధనదుండు ధన సంచయంబు లక్షయంబు లగునట్లుగా వరంబులిచ్చి దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని శక్రుం డిదియేమి యెందులకుం బోయెదవని యడిగిన నయ్యింద్రునకుఁ గలి యిట్లనియె. 55

టీ. ఇట్లు; అపూర్వస్వయంవరలబ్ధ = నూతనముగావచ్చిన (సాటిలేని) స్వయంవరమునందుఁ బొందబడినది; అయినదమయంతిన్; అత్యంతవిలాసంబుతోన్ = ఎక్కువవేడుకతో; వివాహంబయిన ఆనలునకున్; మెచ్చి; వాని

యజ్ఞంబులందుఁ=అనలమహారాజుచేయుజన్నంబులందు; నిజరూపంబుతోఁ= తనయొక్క స్వస్వరూపంబుతో;(దేవతలగ్నిముఖులై యజ్ఞంబులందుహవిర్భాగాదులను గొనుచుందురు. ఇంద్రుఁడు స్వస్వరూపముతోడనేవచ్చిహవిర్భాగంబు గొనునట్లు నలునకు వరంబిచ్చుట విశేషమని తెలిసికొనవలయును.)హవిర్భాగమును=హవిస్సును; కొనను= తీసికొనుటకును; అగ్నియు; వరుణుడును; వాని వలచినచోటఁ అ= అతఁడుకోరినస్థలమునందే; అనల ఉదకంబులు=నిప్పును నీటిని; ఉత్పాదింపను = పుట్టించుటకును; (అగ్ని నిప్పుపుట్టించుటకును; వరుణుండు నీటిని కలిగించుటకు నని క్రమాన్వయము.) ధర్ముఁడు = యముఁడు; వానిచిత్తంబు=అనలునిమనస్సు; ధర్మమునందుఁ అ=ధర్మమునందే; వర్తిల్లను= వర్తించుటకును; ధనదుండు=కుబేరుఁడు; ధనసంచయంబులు=ద్రవ్యరాసులు, అక్షయంబులు = తఱుగనివి; అగునట్లుగాఁ, వరంబులు; ఇచ్చు; దేవలోకంబునకుఁ=స్వర్గమునకు; అరుగువారు = వెళ్ళుచుండువారు (పోవుచుండగా ననుట); ఎదురఁ=ఎదుట; ద్వాపరంబుతోన్=ద్వాపరపురుషునితో; కూడ; వచ్చుకలిన్=వచ్చునట్టి కలిపురుషుని; కని; శక్రుండు=దేవేంద్రుండు;ఇదిఏమి= ఈవచ్చుటకు గారణమేమి? ఎందులకున్ = ఎచ్చటికి, పోయెదవు; అని; అడిగినన్; ఆఇంద్రునకున్; కలి; ఇట్లు అనియెన్.

తే. అవనిలో దమయంతీ స్వ ♦ యంవరంబు
విస్తరిల్లుట విని కడు ♦ వేడ్కతోడ
నేను దమయంతిచే వరి ♦ యింపఁబడుదు
నని తదర్థమై యరిగెద ♦ నాసఁజేసి. 56

టీ. అవనిలోన్=భూలోకంబున; దమయంతీస్వయంవరంబు; విస్తరిల్లుట =మిక్కిలివేడుకతో నడుచుట;విని;కడు వేడ్కతోడన్=మిక్కిలితొందరతో, నేను; దమయంతిచేన్; వరియింపబడుదును. అని; ఆసన్ చేసి = కోరికపడి తదర్థమై=ఆస్వయంవరమునిమిత్తము; అరిగెదను.

వ. అనిన నందఱు నగి నీవందుల కేలపోయెదు. మున్దఱ నివృత్తంబయ్యెనక్కోమలి యొరుల నెవ్వరిమెచ్చక నలుండను వాని వరించె ననినం గలి కరం బలిగి యన్నలునకు దమయంతికిని రాజ్యపరిత్యాగంబును బరస్పర వియోగక్లేశంబును జేసెదనని నిశ్చయించి వాని నత్యురతుంగా నెఱింగి యక్షంబులం జొచ్చియుండ ద్వాపరంబుం బనిచి నలుండు సేయుచున్న యశ్వమేధాధికానేక భూరిదక్షిణా మహాక్రతువులయు, జపహోమదానాది వివిధ పుణ్యకర్మంబులయుం గారణంబునం జొర నవసరంబు గానక యంతరం బన్వేషించుచుం బెద్దకాలంబుండి యొక్కనాడతండశుచియై మఱచి సంధ్యోపాసనంబుం జేసిన నుపలబ్ధావసరుండయి కలి నలునందుం బ్రవేశించి పుష్కరుండనువాని పాలికిం బోయి తన్నెఱింగించి నీవు నలునితోఁ జూదంబాడి వాని రాజ్యంబు సర్వంబును నోడిచికొమ్మని చెప్పి తానును వానికి విప్రవేషంబున సహాయుండై యక్షంబులు గొని పుష్కరునితో నొక్కటం జని నలుంగాంచి నీవు మా రాజుతో జూదంబాడు మనిన.

టీ. అనినన్; అందఱున్ = దిక్పాలురందఱు; నగి = నవ్వి; నీవు; అందులకున్; ఏల; పోయెదవు; ముందఱ = మునుపే; (అది) నివృత్తంబుఅయ్యెన్ = జరిగిపోయెను, ఆకోమలి = ఆవనిత; ఒరులన్ = ఇతరులను; ఎవ్వరిన్; మెచ్చక; నలుఁడు; అనువానిన్; వరించెను = కోరెను. అనినన్; కలి; కరంబు = మిక్కిలి; ఆనలునకున్; దమయంతికిన్; రాజ్యపరిత్యాగంబును = రాజ్యభ్రం

శమును; పరస్పరవియోగక్లేశంబును = ఒండొరులయెడఁబాయుటవలనికష్టము లను; చేసెదను = కలిగించెదను. అని; నిశ్చయించి; వాని; అక్షరతున్ కాన్ = పాచికలాటయందు ఆసక్తిగలవానినిగా; ఎఱిఁగి; అక్షంబులన్ = పాచిక లందు; చొచ్చియుండఁగన్ = ప్రవేశించియుండుటకు; ద్వాపరంబున్; పనిచి = యాజ్ఞచేసి; నలుఁడు; చేయుచున్న; అశ్వ—లయు_అశ్వమేధఆదిక = అశ్వ మేధయాగము మొదలైన; అనేక = మిక్కిలి; భూరి = అపారమైన; దక్షిణ = దక్షిణలుగల; మహాక్రతువులయు = గొప్పయాగములయొక్కయు; జపహో మదానఆదివివిధపుణ్యకార్యంబులయు = జపములు, హోమములు, దానములు మొదలగు నానావిధములైనపుణ్యకార్యములయొక్కయు; కారణంబున్ = నిమిత్తముచేత, చొఱన్ = నలునందుఁ బ్రవేశించుటకు; అవసరంబు; కానక = అవకాశములేక; అంతరంబు = సందు; అన్వేషించుచున్ = వెదకుచు; పెద్ద కాలంబు = చాలదినములు, ఉండి; ఒక్కనాఁడు; అతఁడు, అశుచియై = అపరిశుద్ధుఁడై, మఱచి = జ్ఞప్తితప్పి, సంధ్యోపాసనంబు = సంధ్యావంద నంబు, చేసినన్ = చేయఁగా, ఉపలబ్ధఅవసరుఁడువి = సందుగనిపెట్టినవాఁడై, కలి, నలునందున్, ప్రవేశించి, పుష్కరుఁడు, అనువానిపాలికిన్, పోయి, తన్నున్ - ఎఱింగించి - తానుకలిపురుషుఁడని వానికెఱింగించుకొని, నీవు, నలుని తోన్, జూదంబు, ఆడి, వానిరాజ్యంబు, సర్వంబున్ = సమస్తమును, ఒడిచి కొమ్ము = తీసికొనుము, అని, చెప్పి, తానును, వానికిన్ = ఆపుష్కరునికి, విప్ర వేషంబునన్ = బ్రాహ్మణవేషంబుతో, సహాయుఁడై = తోడ్పడి, అక్షంబులు = పాచికలు, కొని = తీసికొని, పుష్కరునితోన్, ఒక్కటన్, కూడ, చని, నలున్, కాంచి, నీవు, నారాజుతో, జూదంబు, ఆడుము, అనినన్.

క. ద్యూతార్థము తత్కైతవా
హూతుఁడనై జూదమాడ ♦ కుండుట ధర్మో
పేతం బని యభిముఖుఁడయి
యాతనితో నలుఁడు జూద ♦ మాడఁ గడంగెన్. 58

టీ. ద్యూతార్థము = జూదము కొఱకు, తత్కృతవరఆహూతుఁడను = ఆజూదరియగు పుష్కరునిచేఁ బిలువబడినవాఁడను, ఐ = అయి, జూదము ఆడకుండుట, ధర్మఅపేతంబు = న్యాయముకాదు, అని అభిముఖుఁడై = ఒప్పుకొన్నవాఁడై, అతనితోఁ = ఆపుష్కరునితో, నలుఁడు, జూదము, ఆడన్ = ఆడుటను, కడంగెన్ = ప్రయత్నించెను.

క. కలధనము నెల్ల నొడ్డుచు
నలయక జూదమున విజితుఁ ♦ డగుచుండె నిజా
ప్తులు వారించిన నుడుగక
నలుఁడు కలిప్రేరణంబు ♦ నను హతమతియై. 59

టీ. నలుఁడు, కలిప్రేరణంబునను = కలిపురుషుని ప్రోత్సాహముచేతః హతమతి ఐ = బుద్ధిగలిగినవాఁడై, నిజఆప్తులు = తనహితముకోరెడివారు, వారించినన్ = అడ్డగించినను, ఉడుగక = వదలక, కలధనములు ఎల్లన్ = తనకుగలసమస్త ఐశ్వర్యమును, ఒడ్డుచున్ = పందెముఁగాబెట్టుచు, అలయక = విసుకుచెందక, జూదమునన్, విజితుఁడు అగుచుండెన్ = ఓడిపోవుచుండెను.

వ. ఇట్లనేక మాసంబులు దుర్వ్యసనాసక్తుండై యున్నలుండు వివిధ వస్తువాహన నివహంబు లొడ్డి పుష్కరున కోటువడం బోయిన నెఱింగి పౌర బ్రాహ్మణ ప్రధానులు దమయంతీ పురస్కృతులై వచ్చి వారించి కలిసమావేశ పరవశుం డయిన యన్నలుచేతఁ బ్రతిహతులయి పలుకకుండి రంత దమయంతి చింతాక్రాంతచిత్తయై. 60

టీ. ఇట్లు, అనేకమాసంబులు = పెక్కునెలలు, దుర్వ్యసనఆసక్తుఁడయి = దుష్టవ్యసనమగు జూదమునందిచ్ఛగలవాఁడై, ఆనలుఁడు, వివిధవస్తువాహన నివహంబులు = అన్నిరకములైన పదార్థములయు, గుఱ్ఱము లేనుఁగులు మొద

లగువానియు గుంపును, ఒడ్డి = పందెము పెట్టి, పుష్కరునకున్, ఓటు పడఁగ-పోయినన్ = ఓడుచురాఁగా, పౌరబ్రాహ్మణప్రధానులు-పౌర=పుర జనులు, బ్రాహ్మణ=ద్విజులు, ప్రధానులు=మంత్రులు, దమయంతీపురస్కృతులు ఐ = దమయంతిని ముందిడుకొన్నవారై, వచ్చి, వారించి = ఆటంకపెట్టియు, కలిసమావేశ పరవశుఁడు ఐన = కలిపురుషునియొక్క చొచ్చుటచే నోడలుమఱచినవాఁడయిన,అన్నలుచేతన్,ప్రతిహతులై=నివారింపబడినవారయి పలుకకుండిరి. అంతన్=అప్పుడు, దమయంతి, చింతాక్రాంతచిత్త ఐ=దుఃఖముచే నిండింపబడిన మనస్సుకలదై, (మనోదుఃఖముతో ఆవరింపబడినదై).

ఆ. ఎంత యోటువడిన ♦ నంతియు జూదంబు
నందుఁ దగులుఁ జలము ♦ నతిశయిల్లు
నేమి సేయుదాన ♦ నిది యెగ్గునకు మూల
మని లతాంగి దుఃఖి ♦ తాత్మయగుచు. 61

టీ. ఎంత=ఎంతదూరము ఓటువడినన్=ఓడిపోయిన, అంతియ=అంతమాత్రమె, జూదమునందున్, తగులు=ఆసక్తియు, చలము=పట్టుదలయు, అతిశయిల్లున్ = హెచ్చును, ఏమిచేయుదానను = నేనేమి చేయఁగలను, ఇది = ఈజూదము, ఎగ్గునకున్=అపాయమునకు,మూలము=కారణము,అని, లతాంగి= దమయంతి, దుఃఖితాత్మఅగుచున్ = మనస్సునందు దుఃఖముగలదియై.

సీ. అక్షముల్ పుష్కరు ♦ నందు వశ్యంబులై
యునికియు నలునియం ♦ దొండువిధము
లగుటయు నెఱిఁగి ని ♦ జాధీశ్వరున కప
జయముగా లక్షించి ♦ సరసిజాక్షి
భర్తయనుజ్ఞ ముఁగ ♦ పడసి వార్ష్ణేయుఁడన్
సారథిఁ బిలిచి యా ♦ స్యందనమున

నింద్రసేనుండను ♦ నిక్కుమారకు నింద్ర
సేన యన్సూతుఁ జె ♦ చ్చెరన తోడు
ఆ. కొని విదర్భకరిగి ♦ గుఱుకొని మద్బంధు
జనులయొద్దఁ బెట్టి ♦ సరగ రమ్మ
టంచుఁ, బంచి పుచ్చె ♦ నాప్తపురోహిత
మంత్రిబాంధవాభి ♦ మతముఁ బొంది. 62

టీ. అక్షముల్ = పాచికలు, పుష్కరునందుఁ = పుష్కరునికి,(షష్ఠ్యర్థంబున సప్తమి) వశ్యంబులుఐ = స్వాధీనములై, ఉనికియున్ = ఉండుటయు, నలునియందుఁ = నలునకు, (ఇదియు షష్ఠ్యర్థమున సప్తమి) ఓంకువిధములు, అగుటయున్ = వేఱు తీరుగలవిగ నుండుటయు, ఎఱిఁగి, నిజ అధీశ్వరునకు = తనమగనికి, అపజయము అకా = ఓటమియే అగునట్లు, లక్షించి = తలచి, సరసిజ ఆక్షి = తామర రేకులంబోలుకన్నులుగలదమయంతి, మున్ = ముందుగా, భర్త యనుజ్ఞ = పెనిమిటి యాజ్ఞను, పడసి = పొంది, వార్ష్ణేయుఁడు, అనుసారథిఁ, పిలిచి, ఈస్యందనమునన్ = ఈరథంబునందు, ఇంద్రసేనుఁడుఅను ఇక్కుమారకున్ = ఇంద్రసేనుఁడనెడి యీపిన్నకొమారుని, ఇంద్రసేన అను, సూతున్ = కుమారితను, చెచ్చెఱన్ = వెంటనే, తోడుకొని, విదర్భకున్ = విదర్భాపురికి, అరిగి = వెళ్ళి, గుఱుకొని = యత్నించి, మత్-బంధుజనులయొద్దన్ = నాచుట్టముల కడ, పెట్టి = విడిచి, సరగ = తీవ్రముగా, రమ్ము, అటంచుఁ = అనిచెప్పుచు, పంచి = ఆనతిచ్చి, ఆప్తపురోహితమంత్రిబాంధవ అభిమతముఁ = మిత్రులయు పురోహితులయు మంత్రులయు బంధువులయు నభిప్రాయమును పొంది (సారథిన్), పుచ్చెను = పంపెను.

క. నలుఁడను ధరణీరాజ్యము
దలఁగఁగ సర్వంబు నపహ ♦ తంబైన గడున్

దలరి దమయంతిఁ దోడ్కొని
వెలువడియె నశేషరాజ్య ♦ విభవచ్యుతుఁడై. 63

టీ. నలుఁడును, ధరణీరాజ్యముల్ = భూమియు, రాజ్యమును; తలఁగన్ కన్ = పోఁగా, సర్వంబును = సమస్తమును, అపహృతంబు ఐనన్ = దోఁచుకొనిపోఁబడఁగా, కడున్ = మిక్కిలి, తలరి = భయపడి (చింతించి) అశేషరాజ్యవిభవచ్యుతుఁడు ఐ = రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవాఁడై, దమయంతిన్, తోడ్కొని, వెలువడియెన్ = పట్టణమును విడిచిపెట్టెను.

తే. పురము వెలి మూఁడహోరాత్ర ♦ ములు వసించి
యున్న నలుపాలి కెవ్వరు ♦ నోడి రరుగ
జనవిభుండైన పుష్కరు ♦ శాసనమునఁ
గలికృతద్యూతవిద్వేష ♦ కారణమున. 64

టీ. పురము వెలి = పట్టణమునకు వెలుపట, మూఁడు అహోరాత్రములు = మూఁడుదినములు, వసించియున్న, నలుపాలికిన్ = ఆనలమహారాజునొద్దకు, జనవిభుఁడు-ఐన- పుష్కరుశాసనమునన్ = రాజగు పుష్కరుని యాజ్ఞవలనను, కలికృ... మునన్-కలి = కలిపురుషునిచేత, కృత = చేయఁబడిన, ద్యూత = జూదమువలని, విద్వేషకారణమునన్ = విరోధమును కారణమువలనను, ఎవరును = ఒక్కఁడైనను, అరుగన్ = వెళ్ళుటకు, ఓడిరి = భయపడిరి.

వ. ఇట్లు సర్వజనసత్కారార్హుండయ్యును నలుండును విధివశంబున నెవ్వరివలన సత్కారంబు గానక జలంబుల యాహారంబుగాఁ దత్పుర సమీపంబున దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దన ముందటఁ దిరుగుచున్న పక్షులం గని యావి భక్ష్యంబు

లగునని యప్పక్షులం బట్టికొన సమకట్టి తనకట్టిన పుట్టంబు
వానిపై వైచిన నవిపుట్టంబుతోన గగనంబున కెగసినగుచు
విగతవస్త్రుండయిన నలున కిట్లనియె. 65

టీ. ఇట్లు, సర్వజనసత్కార అర్హుండు అయ్యున్ = జనులందఱి యొక్క మర్యాదలకుఁ దగినవాఁడైనను, నలుఁడు, విధివశంబునన్ = దైవవశంబువలన, ఎవరివలనన్, సత్కారము = గౌరవము; కానక, జలంబు = నీళ్ళు, ఆహారము కాన్ = ఆహారము కాఁగా, తత్పురసమీపంబున్ = ఆపట్టణముదగ్గర, దమయంతీ ద్వితీయుండై = దమయంతియే రెండవదిగాఁగలవాఁడై, ఉండి, బుభుక్షాపీడన్ = ఆఁకలిబాధను, సహింప నోపక = ఓర్వఁజాలక, హిరణ్యపక్షంబులతోన్ = బంగారుఱెక్కలతో, తనముందటన్ = తనయెదుటతిరుగుచున్న, పక్షులన్, కని, అవి = ఆపక్షులు, భక్ష్యములు అగును అని = తినదగినవని, ఆపక్షులన్, పట్టికొనన్ = పట్టుటకు, సమకట్టి = ప్రయత్నించి, తనకట్టినపుట్టంబు = తానుదాల్చినవస్త్రము, వానిపైన్ = ఆపక్షులమీఁద, వైచినన్ = వేయఁగా, అవి, పుట్టంబుతోన్ = ఆవస్త్రముతోనే, గగనంబునకున్ = ఆకాశమునకు, ఎగసి = ఎగిరి, నగుచున్ = నవ్వుచు, విగతవస్త్రుఁడయిన = కట్టబట్టలేనివాఁడగు, నలునికి, ఇట్లనియె.

తే. నీధనంబును రాజ్యంబు ♦ నికృతిఁగొన్న
యక్షములమేము నీవస్త్ర ♦ మపహరింపఁ
బక్షిరూపులమై వచ్చి ♦ పార్థివేంద్ర!
యపహరించితిమని చెప్పి ♦ యరిగెఁ జదల. 66

టీ. పార్థివేంద్రా = ఓరాజాధిరాజా! నీధనంబును, రాజ్యంబును, నికృతిన్ = కపటముతో, కొన్న, అక్షములము = పాచికలము, ఏము, నీవస్త్రము; అపహరింపన్; పక్షిరూపులము ఐ వచ్చి అపహరించితిమి; అని, చెప్పి; చదలన్ = ఆకాశమందు, అరిగెన్ = పోయెను.

వ. నలుండును వానిం జూచి విస్మయంబంది యీయపక్షంబుల దోషంబునంగాకేమి నాకిట్టి దయ్యెననుచు దమయంతి కట్టిన పుట్టంబు చెఱంగు కట్టికొనియె నట్లిరువురు నేకవస్త్రులై యొండొరుల మొగంబులుచూచి దుఃఖించుచుండ నలుండు దమయంతి కిట్లనియె. 67

టీ. నలుండును; వానిన్=ఆపక్షులను; చూచి; విస్మయము=ఆశ్చర్యము; అంది; ఈయపక్షంబులదోషంబునన్ కాక=ఈపాచికల(దోషముచలననే తప్ప, ఏమి; నాకున్; ఇట్టిది, అయ్యెను. (ఈపాచికలవలననే నాకింత యనర్థము సంప్రాప్తమయ్యెను.) అనుచు, దమయంతి; కట్టిన; పుట్టంబుచెఱంగు = కట్టుకొన్న చీరచెఱంగును; కట్టికొనియెను, అట్లు; ఇరువురు = ఇద్దఱు; ఏకవస్త్రులు ఐ=ఒంటిబట్ట కట్టినవారై; ఒండొరుల మొగంబులు, చూచి, దుఃఖించుచుండన్; నలుఁడు; దమయంతికిన్; ఇట్లనియె.

క. ఇది దక్షిణాపథంబున
కిదియు విదర్భాపురమున ♦ కిది కోసల కిం
దిది యుజ్జయినికిఁ దెరువులు
మది నిన్నిటిలోన నరుగ ♦ మనకెద్దియుగున్. 68

టీ. ఇది; దక్షిణాపథంబునకున్ = దక్షిణదేశమునకు; ఇదియున్ = మఱియొకటి; విదర్భాపురంబునకున్; ఇది; కోసలకున్= కోశలదేశమునకు; ఇది, ఉజ్జయినికిన్ ఉజ్జయినీపట్టణమునకును; తెరువులు = మార్గములు మదిన్ = మనసులో; ఇన్నిటిలోనన్ = ఈదారులలోన; మనకున్ = మనము, ఎద్ది = ఏదారి, అరుగన్ అగున్ = పోవఁదగును.

క. అడవులలో నాతోఁ గడు
నిడుములు వడ నోప వరుగు ♦ మిందుముఖి! యి

వ్వాడు నీబంధుజనంబుల
కడ కనవుడుఁ దరుణి శోక ♦ గద్గద యగుచున్. 69

టీ. ఇందుముఖి=చంద్రబింబమువంటి మోము గలదానా! అడవుల లోనన్; నాతోన్; కడున్ ఇడుములు=ఎక్కువకష్టములు; పడన్ ఓపవు= అనుభవింపఁజాలవు. ఇప్పుడు; నీబంధుజనంబులకడకున్ = నీచుట్టాలదగ్గఱకు; అరుగుము. అనవుడున్= అని చెప్పఁగా; తరుణి = జవ్వని యగు దమయంతి శోకగద్గద = దుఃఖముచే డగ్గుత్తిక కలది; అగుచున్.

తే. అతని కిట్టులనియె ♦ నవనీశ! నీవును
నేనుఁ జని విదర్భ ♦ నిష్టలీల
నుండుదము మృగాకు ♦ లోగ్రవనంబుల
కరుగనేల యిడుమ ♦ లందనేల. 70

టీ. ఆతనికిన్; ఇట్టులు, అనియెన్; అవనిఈశ = పుడమి ఱేఁడా! నీవును, నేనున్, చని, విదర్భన్=విదర్భయందు, ఇష్టలీలన్ = ఇచ్ఛావిహారములతో, ఉండుదము. మృగా...వనంబులకున్ _ మృగ = క్రూరజంతువుల చేత, ఆకుల = నిండిన, ఉగ్ర = భయంకరమైన, వనంబులకున్ = అడవులకు, అరుగన్ ఏల=పోవనేల, ఇడుములు=ఆపదలు, అందన్ ఏల=పడుటకుఎందుకు?

వ. అనిన విని నలుండవనతాననుండయి నీ చెప్పినట్లువిదర్భేశ్వరు రాజ్యంబును మన రాజ్యంబ? యేను దొల్లి యధికైశ్వర్య యుతుండనై యందులకుం బోయి బంధుజనులకు హృదయానందంబు సేసి యిప్పు డివ్విధంబున సర్వ హీనుండనై యెట్లు వోవనేర్తు ననిన దమయంతి యిట్లనియె. 71

టీ. అనినన్, విని, నలుఁడు, అవనత ఆననుఁడు ఐ = తలవాల్చిన వాఁడై, నీచెప్పినయట్లు = నీమాటప్రకారమే, విదర్భైశ్వర్యరాజ్యంబును = విదర్భరాజ్యమును, మనరాజ్యంబు అ = మనరాజ్యమే, ఏను, తొల్లి, అధిక ఐశ్వర్యయుతుఁడను ఐ=మిక్కిలిసంపదతోఁ గూడినవాఁడనై, అందులకున్ = ఆవిదర్భకు, పోయి, బంధుజనులకున్ =చుట్టాలకు, హృదయము ఆనందము= మనస్సంతోషము; చేసి; ఇప్పుడు; ఇవ్విధంబునన్; సర్వహీనుండునుఐ = సమస్తమును బోఁగొట్టుకొని; ఎట్లు; పోవనేర్తును = పోవఁగలను. అనినన్ దమయంతి; ఇట్లు అనియెను.

తే. అఖిలదుఃఖరోగార్తున ♦ కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ ♦ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై ♦ యున్నవాని
కెంత లాపదలయ్యును ♦ నెఱుకపడవు. 72

టీ. ఎందుఁ=ఎచ్చటను; అఖిలదుఃఖరోగ ఆర్తునకుఁ=సకలములైన దుఃఖములనువ్యాధులచేత పీడింపబడినవానికి; ఔషధంబు=మందు; భార్య అచూవె=పెండ్లామెసుమా; ఒనరన్ = చక్కఁగా; భార్యసమేతుఁడు ఐ= పెండ్లాముతోఁగూడినవాఁడై;ఉన్నవానికిన్ ఎంతలుఆపదలు=ఎంతకష్టములు; అయ్యును= కలిగినను; ఎఱుకపడవు=తెలియవు.

క. అలయు నెడ డయ్యు నెడ నాఁ
కలియుఁ దృషయు నైనయెడలఁ గనుఁగొని ధరణీ
తలనాథ! పురుషునకు ని
మ్ముల భార్యయ పాచుఁ జిత్త ♦ మున దుఃఖంబుల్. 73

టీ. ధరణీతలనాథ=ఓపుడమి ఱేఁడా! అలయు నెడన్=పనిచేయుటచే నలపుచెందునపుడు, డయ్యునెడన్ = దారినడక మొదలగువానిచే శ్రమపడు

నప్రుడు; ఆఁకలియును; తృషయున్ = దప్పియు; ఐనయెడన్ = కలిగినప్పుడు; కనుఁగొని= కనిపెట్టి; భార్యయు; పురుషునకున్ = మగనికి, చిత్తమునన్ = మన స్సునందు; దుఃఖంబుల్ = కష్టములను, ఇమ్ములన్ = చక్కఁగా; పాచున్ = పోఁగొట్టును.

వ. కావున నిది మదధీనజీవితయునియు ననువ్రతయునియు నను కంపనీయ యనియు నన్ను విడువక నాయనుగమనంబునకు ననుమతుండవు గమ్మనిన నట్ల చేయుదుఁ బ్రాణసమాన వయిన నిన్నేలవిడుతు నోడకుండుమని నలుండు దమయంతి నాశ్వాసించుచు నొక్కటఁ జనిచని విజనంబైన విపినంబున నొక్కసభఁగని యందువిశ్రమించి పరుషధూళిధూసరస్థలం బున శయనించి మార్గశ్రమ నిమీలితనయనుండయి దుఃఖం బునఁ గన్ను మొఁగుడకున్న లేచి తనపాదంబులయంతికంబున నతిక్లేశరవశయయి నిద్రవోయెడు దమయంతింజూచి. 74

టీ. కావున; ఇది= ఈదమయంతి; మత్ - అధీనజీవిత= నాకుస్వాధీనమైన ప్రాణముగలది; అనియున్; అనువ్రత= నావంటి నియమముగలది; అనుసరించి నదిఅనియు, అనుకంపనీయ= దయచూపదగినది; అనియు; నన్నున్; విడువక; నాయనుగమనంబునకున్ = నేను వెంటవచ్చుటకు; అనుమతుండవు; కమ్ము= అంగీకరింపుము, అనినన్, అట్లు అ= అలాగున నే,చేయుదును, ప్రాణసమానవు= నాప్రాణములకు సమానురాలవు; అయిన; నిన్నున్; ఏల; విడుతును, ఓడకఉండుము = వ్యసనపడకుండుము, అని నలుఁడు, దమయంతిన్, ఆశ్వా సించుచున్= ఊఱడించుచు, ఒక్కటన్= కూడ, చనిచని= పోయిపోయి, విజ నంబు = ఏకాంతము, ఐన, విపినంబునన్ = అడవియందు, ఒక్కసభన్ = ఒక్క రచ్చకొట్టమును, కని, అందున్ = దానియందు, విశ్రమించి = దిగి

పరుషధూళిధూసరస్థలంబునన్-పరుష=కఱుకైన, ధూళి=దుమ్ముచే, ధూసరిత=పాంగవర్ణముగలదిగా చేయఁబడిన, స్థలంబునన్=ప్రదేశమునందు, శయనించి, మార్గశ్రమనిమీలిత నయనుఁడు ఐ-మార్గశ్రమ=దారినడకవలని యలసటచే, నిమీలిత=మూసికొన్న, నయనుఁడు అయి=కన్నులుగలవాఁడై, దుఃఖంబునన్ = వ్యసనముచేత, కన్ను మొగుడకున్నన్ = నేత్రములు మూతపడకయుండగా; నిద్రరాకయుండఁగా, లేచి=కూర్చుండి, తనపాదములయంతికంబునన్=తనకాళ్ళదగ్గర, అతిక్లేశపరవశ అయి = ఎక్కువ దారిబడలికచే సొక్కినదై, నిద్రవోయెడు దమయంతిన్, చూచి,

సీ. ధరణిరాజ్యంబుతో ♦ ధన మెల్లఁ బరులచే
నపహృతం బగుటయు ♦ నాప్తమిత్ర
బంధుజనంబులుఁ ♦ బ్రకృతిజనంబులు
విడుచుటయును మహా ♦ విపినభూమిఁ
బత్నితోఁ దనపఁ ♦ భ్రమించుటయు నప్డు
దలఁచి శోకించి యి ♦ త్తరుణి దొల్లి
మృదుశయనంబున ♦ మెలతలు మెలపుతో
నడుగు లొత్తఁగ నిద్ర ♦ యనుభవించుఁ
ఆ. కోమలాంగి యిపుడు ♦ గుఱుకొని పాంసుల
స్థలమునందు నిద్రఁ ♦ దగిలినదియుఁ
బంకజాక్షి నాకు ♦ భార్యయై యింత దుః
ఖంబుఁ బొందె దైవ ♦ ఘటనఁ జేసి. 75

టీ. ధరణిరాజ్యంబుతోన్=భూమిపరిపాలనంబుతో, ధనము ఎల్లన్=ద్రవ్యమంతయును, పరులచేన్=శత్రువులచేత, అపహృతంబు, అగుటయున్=అపహరింపబడుటయు, ఆప్త...జనంబులున్-ఆప్త = మేలునుదెల్పువారు,

మిత్ర=చెలికాండ్రను; బంధుజనంబులున్=చుట్టములును, ప్రకృతిజనంబులున్=మంత్రులును, విడుచుటయును = విడిచిపెట్టుటయు, మహావిపినభూమిన్=కాఱడవియందు; పత్నితోన్ = భార్యతో; తనపరిభ్రమించుటయున్=తాను తిరుగాడుటయు; అప్డు, తలంచి; శోకించి = దుఃఖించి; ఈతరుణి = ఈవనిత; తొల్లి; మృదుశయనంబునన్=మెత్తనిపాన్పునందు; మెలఁతలు=చెలికత్తెలు; మెలఁపుతోన్ = జాగ్రత్తతో; అడుగులు ఒత్తన్=కాళ్ళుపిసుకఁగా; నిద్ర అనుభవించు = నిద్రపోవునట్టి; కోమల అంగి=మృదుశరీరముగలది; ఇపుడు శ్రమించుకొని = కష్టపడి; పాంసుస్థలమునందున్ = దుమ్ముతో నిండినతావునందు, నిద్రన్ తగిలినదియున్=నిద్రచెందునదియు; పంకజాక్షి=తామరరేకులంబోలు కన్నులుగలదియగు; ఈచాన; నాకున్; భార్య; ఐ; దైవఘటనన్ చేసి =గ్రహచారముల వలన; ఇంతదుఃఖంబున్; పొందెను.

వ. ఏను దీనిదుఃఖంబుఁ జూడనోప నెటయేనియుం బోయెద నిది నన్నుంగానక తన బంధులయొద్దకుంబోయి దుఃఖపడకుండునని విచారించి పోవ సమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దానివస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు చేసికొని వెలువడి కొండొకనేల పోయి దమయంతియందు ఘనంబైన తన నెయ్యంబునుఁ దీఁగఁద్రెంపనేరక క్రమ్మఱ నచ్చోటికి వచ్చి. 76

టీ. ఏను, దీనిదుఃఖంబులన్। చూడనోపను=చూడజాలను, ఎటకేనియున్ = ఎచ్చటికేనియు, పోయెదను, ఇది, నన్నున్, కానక, తనబంధులయొద్దకున్, పోయి, దుఃఖపడక, ఉండును, అని విచారించి=తలపోసి. పోవన్, సమకట్టి=నిశ్చయించి ఆకోమలి; మేలుకొనకుండన్, మెల్లన=తిన్నగా, దానివస్త్రంబునందున్, అర్ధంబు=సగము, చించి, తనకు, పరిధానంబు=కట్టువస్త్రంబుగా, చేసికొని, వెలువడి = బయలుదేరి, కొండొకనేలపోయి=కొంతదూరంబుచని

దమయంతియందుఁ, తనసెయ్యంబు అనుతీఁగన్=తనప్రేమయనెడి తీఁగను, త్రెంపన్, నేరక = చాలక, క్రమ్మఱన్ = తిరిగి; అచ్చోటికిన్, వచ్చి.

చ. కలిదమయంతిఁ బాప సమ ♦ కట్టుసతిం బతివాయనోపఁడా
లలనను దీర్ఘ సౌహృదబ♦లంబున నిట్టులు రెంటఁజేసి యా
నలుఁడువిమోహరజ్జులబె ♦ నంగి గతాగతకారి యైన యు
య్యేలయునుబోలె నూఱడక ♦ యెంతయుఁ బ్రొద్దు వినిశ్చి
[తాత్ముఁడై. 77

టీ. కలి=కలిపురుషుఁడు, దమయంతిన్, పాపన్ = వదలిపోవు నట్లుచేయుటకు, సమకట్టున్=పూనును, సతిన్ = పతివ్రతయైన, ఆలలనను = సుందరిని, నలుఁడు, దీర్ఘసౌహృదబలంబునన్=విస్తారమైనచెలిమియొక్క సామర్థ్యముచేత, పాయన్ ఓపఁడు = విడిచిపోవఁజాలఁడు, ఇట్టులు=ఇవ్విధంబున, రెంటన్ చేసి=కలిప్రేమ బలములవలన, ఆనలుఁడు, విమోహరజ్జులన్=మోహమనెడిత్రాళ్ళయందు, పెనంగి=మెలివడి, గతఆగత కారి=వచ్చుటపోవుటలను, చేయునట్టి, అయిన ఉయ్యేలయున్ పోలెన్=ఉయ్యాలవలె, ఊఱడక = నిలుకడలేక, ఎంతయున్ ప్రొద్దు=దీర్ఘకాలమునకు, వినిశ్చితాత్ముఁడై=మనస్సునందు నిశ్చయము చేసికొన్నవాఁడై, (పై. పద్య. అ.)

తే. బాల నొక్కర్తు నిక్కాన ♦ పాలునేసి
నిష్ఠురుండ నై యే నెట్లు ♦ నేర్తుఁ బోవ
ననక కలిచేత నాకృష్టుఁ ♦ డైన నలుఁడు
విగతకరుణుఁడై దమయంతి ♦ విడిచి చనియె. 78

టీ. బాలన్ = ధైర్యములేనిదియగు నీదమయంతిని, ఒక్కర్తున్ = ఏకాకి, ఇక్కానపాలు చేసి = ఈయడవిపాలుచేసి, నిష్ఠురుఁడను ఐ = దయలేని వాఁడనై, ఏను, ఎట్లు, పోవన్ నేర్తును = పోఁగలను,

అనక = విచారింపక, కలిచేతన్, ఆకృష్టుఁడు = ఈడ్వఁబడినవాఁడు, ఐన నలుఁడు, విగతకరుణుఁడు ఐ = దయమాలినవాఁడై, దమయంతిని, విడిచి చనియెన్ = వెళ్ళిపోయెను.

వ. అంత దమయంతి మేలుకని తన పతిం గానక తన వస్త్రార్ధ
నికర్తనంబునుంజూచి లేచి నలుఁగడలుం బరికించి భయ
శోక వ్యాకులచిత్తయై. 79

టీ. అంతన్=తర్వాత, దమయంతి, మేలుకని=నిద్రలేచి, తనపతిన్, కానక = చూడక, తనవస్త్రార్ధనికర్తనంబునున్=తనచీరలో సగము చింపఁబడియుండుటను, చూచి, లేచి, నలుగడలను=నాలుగుదిక్కులను, పరికించి=వెదకి, భయశోకవ్యాకులచిత్త ఐ=భీతిచేతను, దుఃఖముచేతను గలవరపడిన మనస్సుగలదై.

సీ. హా! మహారాజ! మ ♦ హామహీరక్షణ
దక్షదక్షిణబాహు ♦ దండ! దండి
తారాతి! నిషధరా ♦ జాగ్రణి! నన్నిట్లు
పీతదయుండవై ♦ విడిచిపోవఁ
దగునె నీవెన్నఁడు ♦ ధర్మువుఁ దప్పని
వాఁడవు సూనృత ♦ వ్రతరతుండ
వోడకుమని నన్ను ♦ నూఱడఁ బలికిన
పలుకిప్డు మఱవంగఁ ♦ బాడియయ్యె
ఆ. పొదలలోన దాఁగి ♦ పొడసూప కిట్లేల
యున్నవాఁడ విట్టి ♦ యుగ్రభావ
మేల నీకు నయ్యె ♦ నెట పోదు నిన్నెట్లు
గాంతు నింక నుగ్ర ♦ కాననమున. 80

టీ. హేమహారాజ = ఓరాజేంద్రుఁడా, మహా... రాతి... మహత్ = గొప్పదైన-విశాలమైన, మహీ=పుడమియొక్క, రక్షణ=పాలించుటయందు, దక్ష=నైపుణ్యముగలదైన, దక్షిణబాహు=కుడిచేతిచేత, దండిత=శిక్షింపఁబడిన, ఆరాతి = శత్రువులుగల, నిషధరాజాగ్రణి = మేటియైన యోనిషధదేశాధిపా, నన్నుఁ, ఇట్లు, వీతదయుండవై=దయమాలినవాఁడవై, విడిచిపోవన్ = విడిచిపెట్టిపోవుట, తగును ఏ=యుక్తమా ? నీవు, ఎన్నఁడు, ధర్మవున్ = న్యాయమును, తప్పనివాఁడవు. సూనృతవ్రతరతుండవు. నిజము మాటలాడుటయే ప్రధానవ్రతముగాఁ గలవాఁడవు. ఓడకుము=భయపడకుము, అనిననుఁ, ఊఱడన్=నిమ్మళించునట్లు, పలికిన పలుకు = చెప్పినమాట, మఱవన్ కన్=మఱచుట, పాడి అయ్య = తగునయ్యా, పొదలలోనన్ = తీఁగలగుంపులందు, దాఁగి; పొడసూపక = కనుపించక, ఇట్లు, ఏల=ఎందుకు, ఉన్నవాఁడవు. ఇట్టి ఉగ్రభావము=ఈలాటికటికతనము, ఏల = ఎందుకు, నీకున్, అయ్యెన్=పుట్టెను. ఎటన్=ఎచ్చటికి, పోదును, ఇంకను, ఉగ్రకాననమునన్=భయంకరారణ్యమునందు, నిన్నుఁ, ఎట్లు, కాంతును = చూతును.

క. వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు ♦ నధ్యయనము సో
ల్పగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోల ♦ వఁట సత్యంబున్. 81

టీ. వగవన్ కన్=విచారింపఁగా; సాంగఉపాంగములు = ఆఱంగములు, ఆఱుఉపాంగములు కూడిన; నాలుగు వేదములయు = నాలుగు వేదములయొక్కయు; అధ్యయనము = చదువుట; సొల్పగా = సరిగా; ఒకసత్యముతో = నిజమైనమాటను నెఱవేర్చుటతో; ఎన అగునే = సమానమగునా ? ఎవ్వియున్=మంచికార్యములును; సత్యంబున్ = నిజము మాటాడుటను; పోలవు అఁట = తూఁగవఁట, సత్యవాక్యము నెఱవేర్పుతో నేవియు సమానములుగావు.

వ. ప్రాణసమానవైన నిన్నవశ్యంబు విడువనని పలికితి సత్య ప్రతిపాలనంబు సేయుమని ప్రలాపించుచుం దన యేకాకిత్వం బునకు నబల భావంబునకుఁ బ్రతిపదన్యాస జాయమాన కంటకమృగపన్నగ భయంబునకు వగవక నిజనాథు నసహా యత్వంబునకు దుస్సహ క్షుత్పిపాసా శ్రమాకులత్వంబునకు వగచుచు. 82

టీ. ప్రాణసమానవు = ప్రాణములతో సాటివి; అయిన నిన్నున్; అవశ్యంబు = తప్పక; విడువన్ అని; పలికితిని; సత్యప్రతిపాలనంబు = ఆడినమాట నిలువేస్పటను; చేయుము. అని ప్రలాపించుచున్ = ఏడ్చుచు; తన ఏకాకిత్వంబునకున్ = ఒంటరితనమునకు; అబలభావంబునకున్ = తనయాడుతనమునకు; ప్రతిపద... భయంబునకున్ - ప్రతిపదన్యాస = ఒక్కొక్క యడుగిడుటపట్టునప్పుడు; జాయమాన = పుట్టుచుండు; కంటక = ముండ్లు; మృగ = మృగములు; పన్నగ = పాములు, వీనివలని; భయంబునకున్ = వెరపునకు; వగవక = చింతింపక నిజనాథునసహాయత్వంబునకున్ = తన పెనిమిటితోడు లేమికి; దుస్సహ...త్వంబునకున్ - దుస్సహ = ఓర్వరాని; క్షుత్ = ఆఁకలి; పిపాసా = దప్పి; వీనివలనఁగలిగిన; శ్రమ = అలసటచేతనైన; ఆకులత్వంబునకున్ = కలవరపాటునకు, వగచుచున్ = చింతించుచు. (వై. పద్య. అన్వ.)

క. అలయుచుఁ బులుఁగుల మొలుఁగుల
కులుకుచు నుగ్రాంతపమున ♦ కోపక వృక్షం
బులనీడల నిలుచుచు నెలుఁ
గులఁ బులులం జూచి భయముఁ ♦ గొని వగవగచున్. 83

టీ. అలయుచున్ = బడలిక చెందుచు; పులుఁగుల యెలుగులకున్ = పక్షులకూఁతలకు; ఉలుకుచున్ = భయపడుచు; ఉగ్ర ఆతపమునకున్ = తీక్ష్ణమైన యెండకు, ఓపక = సహింపజాలక; వృక్షంబుల నీడలన్ = చెట్ల నీడలయందు; నిలుచుచున్; ఎలుఁగులన్ = ఎలుఁగుబంట్లను; పులులను; చూచి; భయమున్ కొని = వెఱచి; వగవగచున్ = చింతించుచు.

క. ఏచినపొదలఁ బడల్పడఁ
ద్రోచుచు ముండ్లకును నల్లఁ ♦ దొలఁగుచు దిక్కుల్
చూచుచుఁ దొడరుచుఁ ద్రెళ్ళుచు
లేచుచు లతాంగి సంచ ♦ లించుచు నరిగెన్. 84

టీ. లతాంగి = తీఁగెవంటి మేనుగల దమయంతి; ఏచినపొదలన్ = దట్టమైయున్న పొదలను; పడల్పడన్ = పొఱ్ఱగులు పడునట్లు, త్రోఁచుచున్; ముండ్లకున్; అల్లన్ = నెమ్మదిగా; దూరముగా; తొలఁగుచున్; దిక్కులు = నలువైపులు; చూచుచున్; తొడరుచున్ = తొట్రుపడుచు; త్రెళ్ళుచున్ = క్రిందఁబడుచు; లేచుచు; సంచలించుచున్ = వణఁకుచు; అరిగెన్ = పోయెను.

వ. ఇట్లరుగుచున్న దమయంతి నంతికన్యస్తచరణ యయిన దాని నాహారార్థియై యొక్క పన్నగంబు పట్టికొనిన నక్కోమలి మెదలనేరక. 85

టీ. ఇట్లు; అరుగుచున్న దమయంతి; అంతికన్యస్తచరణ అయినన్ = సమీపమునందుంపఁబడినపాదములుగలది కాఁగా; సమీపమున పాదము లెత్తి ట్టఁగా, దానిన్ = ఆదమయంతిని; ఆహారఅర్థి ఐ = ఆహారము గోరినదై, ఒకపన్నగంబు = ఒక పాము; పట్టుకొనినన్ = పట్టఁగా; ఆకోమలి = ఆమె పైని; మేనుగల దమయంతి; మెదలనేరక = కదలఁజాలక.

ఆ. ఇంకనైన నన్ను ♦ నేల యాలింపవు
నాకు శరణమగుము ♦ నాథ! యనుచు
నఱచుచున్న దాని ♦ యాక్రందనధ్వని
వినుచు నొక్క యెఱుకు ♦ వేగ వచ్చి. 86

టీ. ఇంకన్ ఐనన్ = ఇఁకమీఁదనైనను; నన్నున్ = నామొఱను ఏల; ఆలింపవు = వినవు, నాథ = నాప్రాణరక్షకా; నాకున్; శరణము; అగుము = రక్షకుఁడ వగుము. అనుచున్; అఱచుచున్నన్ = కూయుచుండఁగా, దాని ఆక్రందనధ్వని = దానియార్పు చప్పుడును, వినుచున్; ఒక్క ఎఱుకు = ఒక ఎఱుకువాఁడు; వేగ = తొందరగా; వచ్చి.

వ. తనపట్టినసురియ నప్పెనుఁబాముపదనంబు వ్రయ్యంబఱిగిన రాహుముక్త యయిన చంద్రరేఖయుం బోలె నజగర ముఖంబువలన వెలువడిన యాదమయంతి నాశ్వాసించి తత్సమీప సరోవరస్నాతను వన్యస్వాదుఫలాహారనుగా జేసి నేదదీర్చి నీవెవ్వరిదాన వేకతంబ యివ్వనంబున కేల వచ్చితి వని యడిగి మృదుభాషిణియైన యమ్మగువ వలన నంతవృత్తాంతంబు నెఱింగి. 87

టీ. తనపట్టినసురియన్ = తాను ధరించిన కత్తిచేత; ఆ పెనుఁబాము వదనంబు=ఆకొండచిలువయొక్క నోటిని; వ్రయ్యన్=చీలునట్లు; తఱిగినన్= నఱుకఁగా; రాహుముక్త అయిన చంద్రరేఖయున్ పోలెన్ = రాహువు నోటినుండి విడువఁబడిన చంద్రరేఖవలె; అజగరముఖంబువలనన్ = ఆకొండ చిలువయొక్క నోటినుండి; వెలువడిన =విడిపించుకొనివచ్చిన, దమయంతిన్; ఆశ్వాసించి = ఊఱడించి; తత్ సమీప...స్నాతను-తత్ = ఆప్రదేశమునకు, సమీప = దగ్గిరనున్న; సరోవర = మనోహరమైన కొలనియందు;

స్నాతను = స్నానముచేసిన దానిని; వన్య...హారనుగాన్ - వన్య= అడవియందు దొఱకెడి; స్వాదు=తియ్యని; ఫల=పండ్లు, ఆహారము గాన్= ఆహారముగాఁగలదానినిగా; చేసి, సేదదీర్చి = బడలికపోఁగొట్టి, నీవు ఎవ్వరిదానవు = ఎవ్వరికి సంబంధించినదానవు; ఏకతంబ, ఒంటరిగా; ఇవ్వనంబునకున్, ఏలవచ్చితివి; అని; అడిగి మృదుభాషిణి = మెల్లదిగా మాటాడునది; ఐన ఆకోమలివలనన్; అంత వృత్తాంతంబు=వార్తనంతయు; ఎఱింగి = తెలిసికొని.

శవిరాజవిరాజితము.

రజనికరానన మేచకకుంతల • రాజిత రాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు • కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగిక • నింద్యచరిత్రకు వేడుకతోన్

టీ. రజనికర ఆననన్ = చంద్రునివంటి ముఖము కలదియు; మేచకకుంతల రాజితన్ = నల్లని వెంట్రుకలచేఁ బ్రకాశించునదియు, విలసద్గజగామినిన్ = గొప్ప యేనుఁగువలె మెల్లగా నడుచునదియు, చందనగంధిన్ = శ్రీచందనమువంటి మేనితావిగలదియు; ప్రకాశితకాంతిసమన్వితన్= వెలిఁగెడి కాంతితోఁగూడినదియు; పంకజదళలోచనన్ = తామరరేకులం బోలిన కన్నులగలదియునైన; రాజసుతన్= రాజపుత్రికయగు దమయంతిని; చూచి, కిరాతుఁడు= ఎఱుకవాడు; కామ...హతుఁడై - కామ=మన్మథుని యొక్క; నిశాత = వాఁడియైన; శర = అమ్ములచేత, అహతుఁడై = బాగుగాచేయబడినవాఁడై అనింద్యచరిత్రకున్ = పొగడఁదగిన నడవడిగల; లతాంగికిన్ = దమయంతికి, వేడుకతోన్= కోరికతో, నిజహృదయంబు = తన మనస్సులోని యభిప్రాయమును, ఎఱింగించెన్ = తెలిపెను.

ఆ. అగ్నిశిఖయుఁబోలె ♦ నంటను డాయను
జూడరానియట్టి ♦ శుభచరిత్ర
నెఱుక లేని కఱకు ♦ టెఱుకు కపేక్షించెఁ గాఁ
దనక తనకు నాయు ♦ వల్పమైన. 89

టీ. అగ్నిశిఖయుఁబోలెన్ = నిప్పుమంటవలె, అంటను = తాఁకుటకును, డాయను = సమీపమునకు వచ్చుటకును; చూడన్ = చూచుటకును, రానియట్టి= వీలుపడనిదగు, శుభచరిత్రన్ =పవిత్రమైన నడవడిగల యాదమయంతిని; ఎఱుక = జ్ఞానము; లేనియట్టికఱకు ఎఱుకు = లేఁటి కౄరుఁడైన బోయవాఁడు; కొదుఅనక=పరస్త్రీని గోరుట తగదని యోచింపక; తనకున్ ఆయువు=జీవితకాలము,అల్పము ఐనన్ =తక్కువపడఁగా, అపేక్షించెన్ = కోరెను.

వ. దమయంతియు వాని నలిగిచూచి యేను బతివ్రతనైతినేని
యిద్దురాత్ముండైన కిరాతుండు మృతుండయ్యెడు మని
శాపంబిచ్చిన వాఁడప్పుడు యగ్నిదగ్ధంబయినవృక్షంబునుం
బోలె విగతజీవుండయి పడియె, నట్లు పరమ పతివ్రతాత్వ
ప్రభావంబున. | 90

టీ. దమయంతియున్; వానిన్ = ఆయెఱుకువానిని; అలిగిచూచి = కోపముతోఁచూచి, ఏను, పతివ్రతను, ఐతిని ఏని, ఇద్దురాత్ముఁడు=చెడ్డతలంపు గలవాఁడు, ఐనకిరాతుఁడు, మృతుండు అయ్యెడుఁన్ అని=చచ్చునుగాకయని, శాపంబు; ఇచ్చినన్, వాఁడు; అప్పుడు = ఆతక్షణమునన్, అగ్నిదగ్ధంబుఐన వృక్షంబునుంబోలెన్ = నిప్పుచేగాలిన చెట్టువలె; విగతజీవుఁడుఐ=ప్రాణముపోయినవాఁడయి, పడియెన్ ; క్రిందబడియెను, అట్లు; పరమ పతివ్రతాత్వ ప్రభావంబునన్ =మిక్కుటమైన పాతివ్రత్యమహిమచేత.

క. బాల హృదయమున నృపశా
ర్దూలు నిజాధీశు నిలిపి ♦ దుష్టోరగశా
ర్దూలాభీలమృగావళి
కోలిన భయ మంద కరిగె ♦ నుగ్రాటవిలోన్. 91

టీ. బాల=ముదియయగుదమయంతి, హృదయమునన్=మనస్సునందు, నృపశార్దూలున్=రాజులలో శ్రేష్ఠుఁడైన, నిజాధీశున్=తనభర్తను,నిలిపి; దుష్ట...వళికిన్-దుష్ట=చెడ్డ; ఉరగ=పాములు, శార్దూల=పులులు,ఆభీల=క్రూరములైన, మృగ ఆవళికి=మృగములగుంపునకు, భయము, అందక, ఓలిన్ ఆ=క్రమముగానే; ఉగ్రఅటవిలోన్=భయంకరమైనయడవిలో; అరిగెన్=పోయెను.

వ. మఱియును. 92

టీ. మఱియున్ = ఇంకను,

సీ. సహకార ! మత్ప్రియ ♦ సహకారుఁ బున్నాగ !
పున్నాగుఁ దిలక ! భూ ♦ భువనతిలకుఁ
జందన ! బుధహరి ♦ చందనుఁ బుష్పితా
శోక ! సుహృజ్జన ♦ శోకదమను
వకుళ ! కులైకదీ♦పకు విభీతక ! భయ
భీతారిహారు నలుఁ ♦ బీతితోడఁ
గానరే కానరే ♦ కానలోకోత్తరు
నని మ్రానిమ్రానికి ♦ నరిగి యరిగి
ఆ. యడుగు నడుగు లెండ ♦ వడిఁ బుడపుడఁ బోకఁ
నిర్ఝరాంతరముల ♦ నిలుచుఁ బొలుచుఁ
దరుల గిరులమొడల ♦ నురుగుహా గృహములఁ
దొంగి తొంగి చూచుఁ ♦ దోయజాక్షి. 93

టీ. సహకార=తియ్యమామిడిచెట్టా; మత్ప్రియసహకారుఁడ = నాకు యిష్టమయినచెలికానిని; పున్నాగ=సురపొన్నచెట్టా, పున్నాగుఁడ=పురుషుల లోనుత్తముని, తిలక=ఓతిలకవృక్షమా; భూభువనతిలకుఁడ=భూలోకంబునకు తిలకము మాడ్కి ప్రకాశము గలిగించువానిని, చందన=ఓగంధపుఁజెట్టా; బుధ హరిచందనున్=పండితులకుగల్పవృక్షమువంటివానిని, పుష్పితాశోక=పూఁచిన యశోకవృక్షమా; సుహృజ్జనశోకదమనుఁడ = ప్రేమించువారిదుఃఖమును బో గొట్టువానిని; వకుళ=పొగడచెట్టా, కులైకదీపకుఁడ=కులమునకంతటికిముఖ్య ప్రకాశకుని; విభీతక=ఓతాఁడ్రచెట్టా, భయ...హరుఁడ-భయ=వెఱపుచేత, భీత = దిగులుపడినవారియొక్క; ఆర్తి=బాధలను, హరుఁడ=పోగొట్టువాని, కాన=ఓయరణ్యమా; లోకోత్తరుఁడ = జనులలో నుత్తముని; ప్రీతితోడఁ= ప్రేమతో; కానరుపే కానరుపే=చూచితిరా చూచితిరా అని; తోయజఅక్షి= కమలములంబోలుకన్నులుగలదమయంతి; మ్రానిమ్రానికిఁ=చెట్టుచెట్టునకు; అరిగిఅరిగి=పోయిపోయి; అడుగుచు, అడుగులు=అఱకాళ్లు; ఎండవడిన్ = ఎక్కువయెండకు; పురపురన్=పురపురమని; పొక్కన్ = బొబ్బలులేవఁగా, నిర్ఝరఅంతరములన్ = సెలయేళ్ళమధ్యను, నిలుచున్=నిలువబడును, తరుల గిరులయెడలన్=చెట్లయొక్కయు, కొండలయొక్కయు సందులందు; పొలుచున్ = కనుపట్టును, ఉరుగుహాగృహములన్=గొప్పవైనగుహలనెడి గృహములయందు; తొంగి తొంగి చూచున్.

వ. ఇట్లు దమయంతి నిజనాథు నన్వేషించుచు భీషణారణ్యం
బునం దిరుగునది ముందట. 94

టీ. ఇట్లు దమయంతి; నిజనాథున్=తనమగనిని; అన్వేషించుచున్= వెదకుచు; భీషణ అరణ్యంబునన్ = భయంకరమైన యడవియందు, తిరుగునది = సంచరించుచు; ముందటన్ = ఎదుట. (వై. ప. అ.)

## మత్తకోకిల.

వారిభక్షులు పర్ణభక్షులు • వాయుభక్షులు శాకనీ
వారభక్షులు వృక్షమూలని • వాససక్తులు నై తపం
బారఁ జేయు మహామునీంద్రుల • యాశ్రమం బెడఁ గాంచె నం
భోరుహాక్షి పురాసమార్జిత • పుణ్యకర్మఫలంబునన్. 95

టీ. అంభోరుహ అక్షి = తమ్మిరేకులవంటి కన్నులు గలదియగు దమయంతి; వారిభక్షులు = నీళ్లేయన్నముగాఁగలవారును; పర్ణభక్షులు = ఆకులే యాహారముగాఁగలవారును; వాయుభక్షులు = గాలియేయాహారముగాఁగల వారును, శాకనీవారభక్షులు = కూరగాయలు, నివ్వరిధాన్యము నాహారముగాఁగల వారును; వృక్ష... సక్తులు-వృక్షమూల = చెట్ల మొదళ్లయందు; నివాస = ఉండుటయందు; సక్తులు = ఆసగలవారును; ఐ; తపంబు = తపస్సు; ఆరన్ = తృప్తిగా చేయు, మహాముని ఇంద్రుల యాశ్రమంబు = మహర్షుల తపోవనంబును; పురా సమార్జిత పుణ్యకర్మఫలంబునన్ = మొట్టమొదట సంపాదింపఁబడిన పుణ్యకర్మల యొక్క ఫలములచేత, ఎడన్ = దవ్వునందు, కాంచెన్ = చూచెను.

వ. ఇట్లు మృగ వ్యాళ తస్కరకిరాత పర్వత నిరంతరంబయిన కాంతారంబునం బుణ్యనదీతీరంబునందు నొక్క మునిపల్లెయందు వసిష్ఠవామదేవ వాలఖిల్యభృగునారదసదృశులైన మహామునులంగని నమస్కరించియున్న నమ్మునులు దమయంతిం జూచి యచ్చెరుపడి యవ్వా! నీవెవ్వరిదాన వెవ్వన దేవతవే? దేవభామినివే? దివ్యంబైన యీ తేజంబుతో నేల త్రిమ్మరెద? వనిన వారలకు దమయంతి యిట్లనియె. 96

టీ. ఇట్లు, మృగ...నిరంతరంబు-మృగ=జంతువులు, వ్యాళ = సర్పములు, తస్కర=దొంగలు, కిరాత=బోయలు, పర్వత=తిప్పలు, వీనిచే, నిరంతరంబు, దట్టమైనది, అయిన కాంతారంబునన్ = అడవియందు, పుణ్యానదీ తీరంబునందున్ = పరిశుద్ధమైన యేటిగట్టునందు, ఒక్కమునిపల్లెయందు=ఒక ముని యాశ్రమంబున, వశిష్ఠ...సదృశులు ఐన = వసిష్ఠుఁడు, వామదేవుఁడు, వాలఖిల్యుఁడు, భృగువు, నారదుఁడు వీరితో సమానులైన, మహామునులన్ = గొప్పఋషులను, కని, నమస్కరించి, ఉన్నన్ = వారియెదుటను నిలువఁబడి యుండఁగా, ఆమునులు, దమయంతిన్ చూచి,అచ్చెరువడి=ఆశ్చర్యము నొంది, అవ్వా=అమ్మా! నీవు, ఎవ్వరిదానవు=ఎవరిభార్యవు, ఈవనదేవతవే, దేవభామినివివే=అచ్చరవే, దివ్యంబు =శ్రేష్ఠము, అయిన ఈతేజంబుతోన్, ఏల క్రుమ్మరెదవు=తిరిగెదవు, అనినన్, వారలకున్, దమయంతి, ఇట్లు, అనియెన్.

క. విను డేఁ బుణ్యశ్లోకుం
డనఁగ సదాయజ్ఞ నిరతుఁ ♦ డనఁగ ధరిత్రిం
దనరిన నలుభార్యను స
జ్జననుత దమయంతి యనఁగఁ ♦ జాలినదానన్. 97

టీ. వినుఁడు, ఏన్, ధరిత్రిన్ = పుడమియందు, పుణ్యశ్లోకుఁడు' అనఁగన్ = అనునట్లును, సదా=ఎల్లప్పుడును, యజ్ఞనిరతుఁడు=యాగములు చేయుటయందు ఆసక్తిగలవాఁడు, అనఁగన్ = అనునట్లు, తనరిన = ఒప్పిన, నలునిభార్యను, సజ్జననుతన్ = సత్పురుషులచేఁ గొనియాడఁబడుదానను, దమయంతి అనఁగన్ చాలినదానను=దమయంతియను పేరుతో నొప్పుదానను.

వ. విధికృతంబున నన్నుం బాసి హృదయేశ్వరుం డెటయేనియుం బోయినఁ దదన్వేషణాసక్తచిత్తనై విపినపరిభ్రమణంబు సేసెద నిత్తపోవనంబునకు వచ్చి నలుండు భవత్పాదాభివందనకృతార్థుండయి యెక్కడకుంబోయె? నతని పోయిన

వల నెఱుంగుదు రేని యానతిండు. కొన్ని దినంబులలోనఁ
దద్దర్శనంబు సంభవిల్లనినాఁడు దేహంబు విడుతునని
యేడ్చుచున్న దానిం జూచి కరుణించి మునులిట్లనిరి. 98

టీ. విధికృతంబునన్ = దైవవశంబుచేత, నన్నున్, పాసి=వదలి, హృదయ ఈశ్వరుఁడు=నామనోనాయకుఁడు, ఎటకేనియుక్=ఎచ్చటికో, పోయినన్ = పోఁగా, తత్...చిత్తను ఐ-తత్ = ఆనామనోవల్లభునియొక్క, అన్వేషణ=వెదకుటయందు, ఆసక్త=తగులుంగలిగిన, చిత్తనై=మనస్సుగలదాననై. విపిన పరిభ్రమణంబు=అడవియందు సంచరించు, చేసెదను, ఈతపోవనంబునకున్ = ఈయాశ్రమమునకు, వచ్చి, నలుఁడు, భవ...ర్థుండు అయి - భవత్ = తమయొక్క, పాద=కాళ్ళకు, అభినందన=నమస్కరించుటచేత, కృతార్థుఁడు అయి=ధన్యుఁడై; ఎక్కడకున్=ఏతట్టునకు, పోయెన్, అతనిపోయినవలను=అతఁడు పోయిన దిక్కు; ఎఱుఁగుదురేనిన్=(మీరు) తెలిసికొనియుందురేని, ఆనతిండు = తెలుపుఁడు, కొన్నిదినములలోనన్ = స్వల్పకాలములోపల, తద్దర్శనంబు = అతని పోఁబడి, దొరకనినాఁడు, దేహంబు విడుతును. అని; ఏడ్చుచున్నదానిన్, చూచి, కరుణించి = దయతలఁచి, మునులు = ఋషులు, ఇట్లు అనిరి.

తే. వనజాతాక్షి ! కతిపయ
దినములఁ జూడంగఁ గాంతు ♦ తివిరి నలుని భూ
జననుతు నెప్పటియట్టుల
తనపురమున రాజ్యలీలఁ దనరెడువానిన్. 99

టీ. వనజ ఆయత అక్షి = తామర రేకులమాడ్కి విశాలమైన కన్నులు గలదానా; తివిరి=ప్రయత్నపడి, భూజనసుతున్ = పుడమియందలి సకల జనులచే స్తోత్రముచేయఁబడువారిని, ఎప్పటియట్టుల = యథాప్రకారముగా; పురమునన్ =తనపట్టణమందు, తనరెడువానిన్ = ఒప్పినవానిని, నలునిన్,

కతిపయ దినంబులన్ = కొన్నిదినములలోపల, చూడంగన్, కాంతువు= చూడఁగలుగుదువు.

వ. మేము తపోదృష్టిం జూచితిమి. దుఃఖింపకుండుమని తాప
సులు తమ యగ్నిహోత్రంబులతో నపారఫలపుష్ప తరునదీ
రమ్యతపోవనంబులతోఁ దారందఱు నదృశ్యులైనం జూచు
దమయంతి యిది కలయో నిక్కంబోయని విస్మయం
బందుచుం జని ముందట నొక్కచనుపఁ గని దానిం జూచు
నప్పు డందలి జనంబులు. 100

టీ. మేము; తపోదృష్టిన్ = జ్ఞానదృష్టిచేత; చూచితిమి=కనుగొంటిమి, దుఃఖింపక ఉండుము. అని, తాపసులు, తమయగ్నిహోత్రంబులతో; అపార...లతోన్=-అపార=విస్తారమైన; ఫల=పండ్లచేతను; పుష్ప=పూలచేతను నిండిన; తరు=చెట్లతోఁగూడిన; నదీ=ఏళ్ళచేత, రమ్య = సుందరమైన; తపోవనంబులతో; వారు=ఆమునులు, అదృశ్యులు ఐనన్=కనఁబడకపోఁగా; చూచి, దమయంతి; ఇది కలయో, నిక్కంబో=నిజమో అని; విస్మయంబు, అందుచున్ = ఆశ్చర్యమునొందుచు, చని; ముందటన్=ఎదుట; ఒకచనుపన్= ఒక్కబిడారును; కని; దానిన్; చూచునపుడు; అందలిజనంబులు- పైపద్యముతో నన్వయము.

సీ. పాంసుజాలంబు పైఁ ♦ బ్రాకినఁ గరము రూ
క్షములగు నూర్ధ్వాల ♦ కములదాని
నతిమలినంబైన ♦ యర్ధవస్త్రంబున
నావృతంబగు దేహ ♦ యష్టిదాని
నాఁకలి తృష నిద్ర ♦ యనువాని నెఱుఁగక
యున్మాదినియుఁ బోలె ♦ నున్నదాని

దమయంతిఁ జూచి కొం ♦ దఱు పిశాచంబని
పఱచిరి కొందఱు ♦ భయముఁ బొంది
ఆ. రందుఁ గొంద ఱధిక ♦ హాసంబు సేసిరి
యడవి నేమి రోసె ♦ దనిరి కొంద
అవ్వ ! నీవు వేల్ప ♦ వౌదని కొందఱు
మొగిన కేలు మోగిచి ♦ మ్రొక్కిరంత. 101

టీ. పాంసుజాలఁబు=ఎక్కువదుమ్ము; పైన్ = మీద, ప్రాఁకినన్=క్రమ్మఁగా; కరము=మిక్కిలి; రూక్షములు=బిరుసులు, అయిన, ఊర్ధ్వ అలకములు దానిన్ =పైకిరేగినముంగురులుగలదానిని, అతిమలినంబు = మిక్కిలిమాసినది, ఐనఅర్ధవస్త్రంబునన్ =సగముకోకచేత, ఆవృతంబు=కప్పఁబడినది; అగు; దేహయష్టిదానిన్ = దండమువంటి దేహముగలదానిని, ఆఁకలి, తృష = దప్పి, నిద్ర, అనువానిన్, ఎఱుఁగక, ఉన్మాదినియున్ పోలెన్ = ఉన్మాదరోగముగలదానివలె, ఉన్నదానిని, దమయంతిన్, చూచి, అందున్ = వారిలో, పిశాచంబు = దయ్యము, అని, పఱచిరి = పరుగిడిరి. కొందఱు, భయమున్ పొందిరి, కొందఱు, అధికహాసంబు చేసిరి = పకపకనవ్విరి. అడవిన్ = అడవిలో, ఏమి, రోసెదు =వెదకెదవు, (అని) కొందఱు, అనిరి. కొందఱు నీవు, వేల్పవు = దేవతవు, ఔదువు, అని, మొగిన్ అ = పూనికతోనే, కేలు మొగిచి = చేతులు ముడిచికొని, మ్రొక్కిరి (నమస్కరించిరి). అంతన్ = అటుతర్వాత.

వ. దమయంతియు సార్థవాహులంజూచి యిమ్మహాగహనంబున నిట్టి జనసంకులంబైన సార్థంబు గానంబడియె నెట్టిపుణ్యాంబో యనుచు వారల కిట్లనియె. 102



టీ. దమయంతియున్, సార్థవాహులన్ = బిడారును, చూచి, ఇమ్మహాగహనంబునన్ = ఈగొప్పయడవియందు, ఇట్టి, జనసంకులంబు = జనులచే కూడుకొనినది, అయిన, సార్థంబు = బిడారు, కానంబడియెను, ఎట్టి పుణ్యంబో = ఏమి నాపుణ్యమో, అనుచున్, వారలకున్, ఇట్లు, అనియెన్,

క. ఏను నలుభార్యఁ బుణ్యవి
హీనతఁ బతిఁ బాసి నవసి ♦ యేకాంతమ యీ
కానలఁ బరిభ్రమించెదఁ
గానరె మీ రమరసదృశుఁ ♦ గరుణాత్ము నలుఁన్. 103

టీ. ఏను; నలుభార్యను, పుణ్యహీనతన్ = పాపముచేత (పుణ్యసంపాదనవలని ఫలంబు లేకపోవుటచేత), పతిన్ = భర్తను, పాసి, నవసి = దిగులుపడి, ఏకాంతము అ = ఒంటరిగా, ఈ కానలన్ = ఈయడవియందు, పరిభ్రమించెదను = తిరుగులాడుచున్నాను, అమరసదృశున్ = దేవతలతో, సాటియైన వానిని, కరుణాత్మున్ = దయాస్వభావంబుగలవానిని, నలున్, కానరు - ఏ=చూడలేరా.

వ. అనిన దమయంతికా సార్థవాహాధ్యక్షుండు శుచియను వాఁడిట్లనియె. 104

టీ. అనినన్, దమయంతికిన్, ఆసార్థవాహాధ్యక్షుఁడు = ఆబిడారు యొక్క యజమానుఁడు, శుచి అనువాఁడు, ఇట్లు, అనియెన్.

క. నలుఁ గాన మివ్వనంబునఁ
గల వెప్పుడుఁ గాంతు ముగ్ర ♦ కరులను సింహం
బుల బులులను నిది మ
ర్త్యుల కవిషయ మాతపంబు ♦ దూఱదు దీనన్. 105

టీ. ఇవ్వనంబునన్, నలున్, కానము = (మేము) చూడలేము. ఎప్పుడును, ఉగ్రకరులన్ = భయంకరములైన యేనుఁగులను, సింహంబులన్, ఋక్షంబులన్ = ఎలుఁగుబంటులను; కాంతము, ఇది = ఈయడవి; మర్త్యులన్ = మానవులను, అవిషయము = చొఱరానిది, దీనన్ = ఈయడవియందు, ఆతపంబు = ఎండ, దూరదు = ప్రవేశింపదు.

వ. అనిన నిచ్చనుప యెటవోయెదునని యడిగిన నిది చేదిపతియైన సుబాహుపురంబునకుం బోయెదునని చెప్పిన నట్లేని యేను మీతోడవచ్చెదనని పరమపతివ్రత పతిదర్శనలాలసయై మునులపలుకులు దలంచుచు సార్థవాహసమూహంబుతోడ నరిగిన, 106

టీ. అనినన్ = అనిచెప్పఁగా, ఇచ్చనుప = ఈబిడారు, ఎటన్, పోయెదున్, అని, అడిగినన్, ఇది=ఈబిడారు, చేదిపతి = చేదిదేశపు రాజు, అగు సుబాహుపురంబునకున్ = సుబాహువుయొక్క పట్టణమునకు, పోయెదును, అని, చెప్పినన్; అట్లుఏని = ఆలాగైనయెడల; ఏను, మీతోడన్, వచ్చెదను, అని, పరమపతివ్రత =మహాపతివ్రతయగు దమయంతి, పతిదర్శనలాలసఐ = భర్తను చూచుటయందాసగలదియై, మునుల పలుకులు=ఋషుల వాక్యములు; తలంచుచున్ సార్థవాహ సమూహంబులతోడన్ = బిడారుతోడ, అరిగినన్ = వెళ్ళఁగా.

క. కడు నెండ యెక్కునంతకు
నుడుగక యచ్చనుప నడచి • యుగ్రాటవిలో
విడిసె బహుశీతజలముల
బెడఁగగు నొక చెఱువునొద్దఁ • బెద్దయు దప్పిన్. 107

టీ. ఆచనుప = ఆబిడారు; కడున్ = మిక్కిలి; ఎండ; ఎక్కునంతకున్ = ఎక్కునంతవఱకు, ఉడుగక = నిలువక, ఉగ్రాటవిలోన్ = భయంకరమైన యడవియందు, నడచి; బహుశీతజలములన్ = మిక్కిలి చల్లనినీటిచేత, బెడఁగు = మనోహరము; అగు, ఒకచెఱువు ఒద్దన్ = సొంపయిన యొక చెఱువుగట్టున, పెద్దయున్, మిక్కిలి; దప్పిన్ = దాహముచేతను, విడిసెన్ = దిగెను.

వ. అంత 108

టీ. అంతన్ = అటుతరువాత.

సీ. అర్ధరాత్రము నప్పు ♦ డందుల కేతెంచె
గజయూథములు జలా ♦ కాంక్షఁ జేసి
యంబుధి విమలజ ♦ లంబు లాస్వాదింపఁ
జనుదెంచు జలధర ♦ సమితియట్లు
చనుపలో నిద్రావ ♦ సక్తులై యున్న వా
రున్నతద్వీపముల ♦ యుగ్రపాద
హతిఁ జేసి మర్దితు ♦ లైరి కొందఱు దంత
హతిఁ జేసి భిన్నాంగు ♦ లైరి కొంద
ఆ. ఱఱచి ప్రాణభీతిఁ ♦ బఱచి మహీజంబు
లెక్కి రందుఁ గొంద ♦ ఱుక్కడంగి
చనుప యిట్టిపాటఁ ♦ బెనుపఱి యవినీతు
సిరియపోలె నడఁగి ♦ పిరసి చెడియె. 109

టీ. అర్ధరాత్రమునప్పుడు = సగమురాత్రియందు; అందులకున్ = ఆచెఱువులోనికి, గజయూథములు = ఏనుఁగుల సమూహములు, జలకాంక్షన్ చేసి = నీరుకావలెనను కోరికచేత, అంబుధి విమలజలంబులు =

సముద్రమునందలి స్వచ్ఛమైన ఉదకము; ఆస్వాదింపన్ = త్రాగుటకు, చను దెంచుజలధర సమితియట్లు=వచ్చునట్టి మేఘసముదాయమోయనునట్లు, ఏతెంచెన్ = వచ్చెను, చనుపలోన్ = ఆబిడారులో, నిద్రాఅవసక్తులు ఐ = నిద్ర యందుఁ జిక్కినవారై, మైమఱచి = ఒడలు తెలియక నిద్రించువారై; ఉన్నవారు, ఉన్న......చేసి - ఉన్నత = ఎత్తైన; ద్విపముల = ఏనుఁగులయొక్క; ఉగ్ర = గొప్పవైన, పాద = కాళ్ళయొక్క; హతిన్ చేసి=త్రొక్కుడువలన; భిన్నఅంగులు=చేతులు, కాళ్ళు మొదలగునవి విఱిగినవారు,ఐరి, అందున్ =వారిలో,వుక్కు అడఁగి=ధైర్యమువదలి, కొందఱు,అఱచి =కూఁతలుపెట్టి, ప్రాణభీతిన్=ప్రాణములు పోవునని యెడిభయముతో. పఱచి= పఱుగెత్తి,మహీజములు=వృక్షములు, ఎక్కిరి,చనుప=బిడారు, పెను ప్రమోదము= సంతోషంబువదలి; అవినీతుసిరి అ పోలెన్ = అడకువలేనివానిసంపదకైవడి, అడఁగి=తగ్గి, విరిసి=చిందరవందరయ్యె, చనియెన్=పోయెను.

వ. అట్టి సంక్షోభంబున మరణంబునకుఁ దప్పి దమయంతి యాత్మగతంబున. 110

టీ. అట్టి సంక్షోభంబునన్ = అట్టి కలవరపాటునందు; మరణంబునకున్ తప్పి=చావునుండి వదలించుకొని, దమయంతి, ఆత్మగతంబునన్ = తన మనస్సులోపలనే, (పై. ప. అ.)

ఆ. జీవితార్థులైన ♦ జీవుల సుఖసుప్తు
లైనవారిఁ జంపె ♦ నఱవ నఱవ
మరణకాంక్ష నున్న ♦ మగువఁ జంపఁగ నను
మఱచె విధికరంబు ♦ మందబుద్ధి. 111

టీ. విధి=దైవంబు, జీవిత అర్థులు ఐన = బ్రతుకుటయందిచ్ఛగల వారగు, జీవులన్=ప్రాణులను, సుఖసుప్తులు ఐనవారిన్ =హాయిగా నిద్రించు

వారిని; అఱవన్ అఱవన్ = (వారు) కూఁతలు పెట్టుచున్నను, చంపెను, మరణకాంక్షన్=చావఁగోరికతో, ఉన్న, మగువన్ = స్త్రీనైన; నన్నున్; చంపఁగన్ =చంపుటకు, మఱచెను, (అది=అవిధి) కరంబు=మిక్కిలి; మంద బుద్ధి = బుద్ధిలేనిది,

(విధి చావఁబ్రయత్నము చేయువారిని జంపక, బ్రతుకగోరువారిని జంపెను. కనుక మందబుద్ధిగలవాఁడని దమయంతి విసుగుచే దైవమును దూఱెను.)

సీ. ఈచప్పతోఁ జని ♦ యివ్వనక్లేశంబుఁ
దలఁగుదు నని బుద్ధిఁ ♦ దలఁచి యున్న
నురుతరసార్థప ♦ యోరాశి హస్తియూ
థాగస్త్యుచేఁ బీత ♦ మయ్యె నదియుఁ
దొలుమేనఁ జేసిన ♦ దుష్కృతశక్తియో
వగవంగ నా స్వయం ♦ వరము నాఁడు
సురవరు లర్థులై ♦ చూచుచు నుండంగ
నలు వరియించిన ♦ నాఁటి యెగ్గు
ఆ. దలఁచి యిట్టి యాప ♦ దలు సేసిరో వేల్పు
లమరకోపమునన ♦ యయ్యె నాకు
నివ్వియోగదుఃఖ ♦ మింకేమి సేయుదు
ననుచు వగచుచుండె ♦ నంబుజాక్షి. 112

టీ. ఈచప్పతోన్ = ఈబిడారుతోఁగూడ; చని=వెళ్ళి; ఈవనక్లేశంబున్=ఈ అరణ్యవాసదుఃఖంబు; తలఁగుదును=పాయుదును, అని, బుద్ధిన్=మనస్సునందు; తలఁచి; ఉన్నన్=ఉండఁగా, ఉరుతరసార్థపయోరాశి-ఉరుతర=మిగులఁగొప్పదైన; సార్థ=వర్తకులబిడారనెడి; పయోరాశి=సముద్రము,

హస్తియూథ, అగస్త్యుచేన్ = ఏనుఁగులసమూహమనెడి యగస్త్యమహాముని చేత, పీతము అయ్యెన్ = త్రాగబడెను. (తొల్లి అగస్త్యమహర్షి పుడిసెడితో త్రాగి, సముద్రమందొకబొట్టు నీరులేకుండఁ జేసెనట. అట్లే యాయేనుఁగుల గుంపు బిడారునంతయుఁ గాలిక్రింద వేసి త్రొక్కి చంపివేసెను. కనుక బిడారంతయు నిహతమాయెనని తా. రూపకాలంకారము) అదియున్ = అట్లగుటయు తొలుమేనన్ = ముందటిజన్మమునందు; దుష్కృతశక్తియో = పాపబలమో; వగవన్ కన్ = యోచింపఁగా; నాస్వయంవరమునాఁడు = నా పెండ్లియప్పుడు; సురవరులు = దేవతలలో శ్రేష్ఠులగు ఇంద్రాదులు; ఆర్తులు ఐ = నన్నుఁగోరినవారై; చూచుచున్; ఉండన్; కన్; నలున్; వరియించిననాఁటియొగ్గు = కోరిన నాఁటి తప్పిదమును; తలఁచి, వేల్పులు, ఇట్టి యాపదలు = ఇట్టికష్టంబులు; చేసిరి ఒ = కలిగించిరో; అమరకోపమునన్ ఆ = దేవతల యాగ్రహముచేతనే; ఈవియోగదుఃఖము = ఈ యెడబాటువలని ఆపద; నాకున్, కలిగెను, ఇంకన్ ఏమి; చేయుదును; అనుచున్; అంబుజాక్షి = తమ్మికంటి; వగచుచుండెన్ = దుఃఖించుచుండెను.

వ. ఇట్లు దుఃఖించుచు దమయంతి ప్రభాతంబైన హతశేషులయినవారలతో ననవరతప్రయాణంబులం జేదిపతిపురంబు సొచ్చి జనసంకులంబయిన రాజమార్గంబున దఱియవచ్చుచున్న దాని దినకరప్రభాపటలధూసరంబయిన దివాతనచంద్రరేఖయుంబోలె దీప్తివిహీనయై డస్సియు రమ్యాకృతియైనదానిం బ్రాసాదతలగతయైన రాజమాత యా దమయంతిని దవ్వులం గని తన దాది కిట్లనియె. 113

టీ. ఇట్లు దుఃఖించుచు; దమయంతి; ప్రభాతంబు ఐనన్ = వేకువన; హతశేషులు అయినవారలతోన్ = చావఁగా మిగిలినవారితో; అనవరతప్రయాణంబులన్ = ఎడతెగని దారినడకలచేత; చేదిపతిపురంబు =

చేదిరాజు పట్టణంబును; చొచ్చి = ప్రవేశించి, జనసంకులంబు = జనులచేఁ గిక్కిరిసినది; అయిన; రాజమార్గమున్ = రాజబాటను; తటియన్ = దగ్గరకు పోఁగా; వచ్చుచున్నదానిన్ = వచ్చునదియు; దినకర...సరంబు - దినకర = సూర్యునియొక్క; ప్రభా = కాంతులయొక్క; పటల = గుంపుచేత, ధూసరంబు = తెల్పునల్పుకాంతిగలసినది; అయిన; దివాతనచంద్రరేఖయున్ పోలెన్ = పగటిపూటనుండెడి చంద్రరేఖవలె; దీప్తివిహీనయై = కాంతి లేనిదై; డస్సియున్ = అలసటనొందియు; రమ్య ఆకృతి ఐనదానిని = చక్కని రూపంబుగలదియునైన యాదమయంతిని; ప్రాసాదశలగత = మేడమీఁద నున్నది, ఐన; రాజమాత = రాజుతల్లి, ఆదమయంతిన్; దవ్వులన్ = దూరమునసె; కని = చూచి; తన దాదికిన్; ఇట్లు; అనియెన్.

తే. జీర్ణమై కడుమాసిన ♦ చీరఁ గట్టి
ధూళిధూసరాలకములు ♦ దూలుచుండ
నబల యున్మత్తవేషిణి ♦ యైన లచ్చి
కరణి నిట వచ్చుచున్నది ♦ కంటె దాని. 114

టీ. ధూళిధూసర అలకములు = దుమ్ముచేనిండిన ముంగురులు; తూలు చుండన్ = రేగియుండఁగా; జీర్ణమై = చినిగినదై; కడున్ = మిక్కిలి; మాసిన చీరన్; కట్టి అబల = ఒకానొకపడుచు; ఉన్మత్తవేషిణి = పిచ్చివేషము ధరించినది; ఐనలచ్చియున్ పోలెన్ = లక్ష్మీదేవివలెన్, ఇటన్ = ఇచ్చటికి; వచ్చుచున్నది; దానిన్; కంటివి ఏ = చూచితివే?

వ. అక్కోమలియందు నా కతిస్నేహంబైనయది. దానిం దోడ్కొని రమ్మనిన నదియు దమయంతిం దోడ్కొని రాజమాతయొద్దకుంజనిన రాజమాతయు దానింజూచి నీ వెవ్వరిదాన? విశ్లేలదుఃఖావేశవివశవయి యున్నదానవు? చెప్పుమనిన దమయంతి యిట్లనియె. 115

టీ. ఆకోణ్కామలియందున్ = ఆచిన్నదానియందు, నాకున్, అతిస్నేహంబు=ఎక్కువప్రేమ, అయినయది=కలిగినయది, దానిన్, తోడ్కొని=పిల్చుకొని, రమ్ము, అనినన్, అదియున్=ఆదాదియు; దమయంతిన్, తోడ్కొని=పిల్చుకొని; రాజమాతయొద్దకున్=రాజుగారితల్లియొద్దకు; చనినన్ = పోఁగా, రాజమాతయున్; దాన్; చూచి; నీవు, ఎవ్వరిదానవు = ఎవ్వరిభార్యవు? ఇట్లు, ఏల, దుఃఖ ఆవేశ వివశవు = దుఃఖముయొక్కపూనికచే, పరవశవు అయి ఉన్నదానవు, చెప్పుము అనినన్, దమయంతి, ఇట్లు అనియెన్.

మధ్యాక్కర.

జితవైరి మత్పతి జూదమాడి ని ♦ ర్జితుఁడయి చనినఁ
బతితోడ నీడయుఁబోలె నేనును ♦ బాయక యరిగి
యతిబుభుక్షాతురుండైన పతిచేత ♦ నవ్వ! దైవాను
మతిఁ జేసి వంచితనైతి నొక్కచో ♦ మఱచి నిద్రించి. 116

టీ. అవ్వ = ఓయమ్మా! జితవైరి = శత్రువుల గెల్చినవాఁడయిన, మత్పతి=నామగఁడు, జూదముఆడి, నిర్జితుఁడుఐ = ఓడినవాఁడై, చనినన్ = (అడవులకు) రాఁగా, పతితోడన్ = మగనితోడ; నీడయున్ పోలెన్=నీడవలె, నేనును, పాయక = విడువక; అరిగి; అతిబుభుక్షాతురుఁడు= ఎక్కువ యాఁకలిచే డస్సినవాఁడు; ఐనపతిచేతన్, దైవఅనుమతిన్ చేసి = భగవదనుగ్రహమువలన; వంచితనైతిని = మోసపుచ్చఁబడితిని; ఒక్కచోటన్; మఱచి నిద్రించి. (పై. ప. అ.)

వ. అంతనుండియు నమ్మహానుభావు నేకవస్త్రి నతిమనోహరు నన్వేషించుచు సైరంధ్రీవ్రతంబుఁ జేకొని వియోగానలంబునం గంది కందమూలఫలంబుల యాహారంబుగాఁ బ్రా

ద్రుపడినచోట నివాసంబుగా మృగంబుల సహాయంబుగా వనంబున బరిభ్రమించెదనని బాష్పజలంబుల నురస్స్థల పరాగంబు పంకంబు సేయుచుఁ బలుకకున్న నాదమయంతికి రాజమాత యిట్లనియె. 117

టీ. అంతనుండియుఁ=అది మొదలుకొని; అమ్మహానుభావుఁ=ఆ మహాసమర్థుని, ఏకవస్త్రుఁ = ఒంటిబట్టగట్టినవానిని, అతిమనోహరుఁ = మిక్కిలి అందమైనవానిని; అన్వేషించుచుఁ=వెదకుచు, సైరంధ్రివ్రతంబుఁ =పనికత్తెవలె ఆభరణములు మొదలగునవి లేకుండుట యను నియమమును, చేకొని=పూని; వియోగఅనలంబునఁ = పతివిరహమనెడి యగ్నితాఁకుడుచేత, కంది=మాడి; కందమూలఫలంబులుఅ = గడ్డలు, దుంపలు, పండ్లుమాత్రమే; ఆహారంబుగాఁ=ఆహారము కాఁగా; ప్రొద్దుపడినచోటుఅ=అస్తమయమైన తావే; నివాసంబుగాఁ = ఉనికిపట్టుకాఁగా, మృగంబులుఅ = అడవిజంతువులే, సహాయంబు కాఁ = తోడుకాఁగా, వనంబునఁ=అడవియందు, పరిభ్రమించెదను = తిరిగెదను, అని; బాష్పజలంబులఁ = కన్నీళ్ళచేత; ఉరస్థలపరాగంబు = ఱొమ్మునందుఁబడిన దుమ్ము, పంకంబుచేయుచు,=బురదయగునట్లు చేయుచు, పలుకక, ఉన్నఁ, ఆదమయంతికిఁ, రాజమాత, ఇట్లుఁ అనియెఁ.

క. నీవుండుము నాకడ నిం
దీవరదళనేత్ర ! నీ ప ♦ తిని రోయఁగ భూ
దేవోత్తములం బనిచెద
నావుడు నిట్లనియె భీమ ♦ నందన నెమ్మిఁ. 118

టీ. ఇందీవరదళనేత్ర = నల్లగలువలంబోలు కన్నులు గలదానా, నీవు; నాకడఁ=నాదగ్గిర,ఉండుము,(నేను)నీపతిని;రోయంగఁ=వెదకుటకు,

భూదేవఉత్తములఁ = బ్రాహ్మణశ్రేష్ఠులను, పనిచెదను=పంపెదను, నావ్రు డుఁ=అని చెప్పఁగా; భీమనందన = దమయంతి, నెమ్మిఁ = ప్రేమతో, ఇట్లు, అనియెన్.

వ. ఏను సైరంధ్రీవ్రతంబు చేకొనియుండెద, నుచ్ఛిష్టంబు భుజి యింపను, బదధావనంబుసేయను, బరపురుషులతోఁ బలుక నోపఁ బతినన్వేషించు పొంటె నరిగెడు బ్రాహ్మణులతోఁ బలుకుదు, నట్లయిన నీయొద్దనుండుదు, నొండువిధంబైన నుండనేరననిన రాజమాత సంతసిల్లి నీకిష్టంబైనవిధంబున నా యొద్దనుండుమని దాని నతిగౌరవంబునం జేకొనియుండ దనకూఁతు సునంద యనుదాని సమర్పించిన. 119

టీ. ఏను; సైరంధ్రీవ్రతంబు; చేకొని యుండెదను = పూనియుండె దను, ఉచ్ఛిష్టంబు = ఎంగిలి, భుజింపను = తినను, పదధావనంబుచేయను = (పరపురుషుల) కాళ్ళుగడుగను, పరపురుషులతోఁ; పలుకనోపను = మాట లాడఁజాలను, పతిఁ = భర్తను; అన్వేషించుపొంటెఁ = వెదకునిమిత్తమై; అరిగెడు బ్రాహ్మణులతోఁ, పలుకుదును. అట్లుఐనఁ = నీవీమాటలకొప్పు కొంటివేని; నీయొద్దఁ; వుండుదును. ఒండువిధంబు ఐనఁ = వేఱువిధముగా నున్నను; వుండనేరను=(నీకడ)వుండఁజాలను. అనినఁ, రాజమాతసంతసిల్లి, నీకుఁ; ఇష్టంబు ఐనవిధంబునఁ అ,=ఇచ్ఛచొప్పుననే; నాయొద్దఁ అ = నా దగ్గరనే,ఉండు, అని, దానిఁ =ఆదమయంతిని, అతిగౌరవంబునఁ=ఎక్కువ మర్యాదతో; చేకొనియుండఁ = ఉంచుకొనుటకు; తనకూఁతుఁ, సునంద యగుదానిఁ, సునంద యను పేరుగల తనకూఁతును; సమర్పించినఁ=సహా యముగా నియ్యఁగా.

క. అలయక పుణ్యవ్రతములు
సలుపుచు సైరంధ్రి యనఁగ • జైద్యేశుపురిన్
నలుదేవి యుండె నెదఁ బతిఁ
దలఁచుచు దుస్సహవియోగ • తాపార్ధితయై. 120

టీ. నలుదేవి = నలునిపట్టపుదేవియగు దమయంతి, చైద్యేశుపురిన్ = సుబాహుని పట్టణంబునందు, ఎదన్ = మనస్సునందు, పతిన్ = భర్తను, తలఁచుచున్, దుస్స...ర్ధితయై-దుస్సహ=ఓర్వరాని, వియోగ=ఎడబాటనెడి, తాప=వేడిమిచేత, అర్ధితయై = కమలినదై, అలయక = శ్రమచెందక; పుణ్య వ్రతములు = మేలుగావించెడినోములు, సలుపుచున్ = చేయుచు, సైరంధ్రి అనఁగన్ = సైరంధ్రియను పేరుతో, ఉండెను.

వ. అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యంబులో
నరుగువాఁడు ముందట. 121

టీ. అటన్ = అరణ్యములో; నలుఁడు; దమయంతిని, పాసి, దారుణ అరణ్యములోన్ = భీకరమైన యడవిలో; అరుగువాఁడు = పోవుచు; ముందటన్ = ఎదుట. (పై. ప. అ.)

చ. అవిరళ విస్ఫులింగనివ • హంబుల నభ్రపథంబునంటుచున్
దవదహనంబుద్రగ తరు• దాహము సేయుచునున్నఁ జూచిమా
నవపతి దానియంతరము• నన్ ఫణియొన్ నరనాథ ! నన్నుఁగా
రవమున వేగ కావనిట• రమ్మనుసార్తమహానినాదమున్ .122

టీ. దవదహనంబు = కాఱుచిచ్చు; అవిరళవిస్ఫులింగ నివహంబులన్ = దట్టములైన మిణుఁగురుల రాసులచేత; అభ్రపథంబున్ = ఆకాశమార్గమున,

అంటుచుఁ = తాఁకుచు; ఉదగ్రతరుదాహము చేయుచు ఉన్నఁ = ఎత్తైన చెట్లను గాల్చుచుండఁగా, మానవపతి = నలుఁడు; దానియంతరమునఁ = ఆమంటనడుమ; నరనాథ = ఓరాజా; నన్నుఁ, గారవమునన్ = ప్రీతితో; వేగ = త్వరగా; కావఁ = రక్షించుటకు; ఇటఁ = ఇచ్చటికి; రమ్ము? అను, ఆర్తమహానినాదముఁ = నొచ్చిన గొప్ప ధ్వని (పై ప. అ.)

క. విని శంకింపక చెచ్చెర
ననఘుం డత్యుగ్రతర ద ♦ వానలమధ్యం
బున కరిగి కనియె దీనా
ననుఁ గుండలితాంగు నొక్క ♦ నాగకుమారున్. 123

టీ. విని = ఆలకించి, శంకింపక = సందేహింపక, చెచ్చెరఁ = వేగముగా, అనఘుఁడు = పాపరహితుఁడైన నలుఁడు; అతి ఉదగ్రదవానల మధ్యంబునకుఁ - అతి = మిక్కిలి; ఉదగ్ర = హెచ్చిన, దవానల = కాఱుచిచ్చు యొక్క, మధ్యంబునకుఁ = నడుమునకు, అరిగి, దీనఆననుఁ = దేవురింపుమోముగలవానిని, కుండలిత అంగుఁ = చుట్టచుట్టుకొనిన శరీరముగలవానిని; ఒక్క నాగకుమారుఁ = ఒక్క చిన్నపామును, కనియెన్.

వ. అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలియై యేను
గర్కోటకుం డనువాఁడఁ గర్మవశంబున నొక్క బ్రహ్మ
ఋషి నుల్లంఘించి తచ్ఛాపంబున నెక్కడం గదలనేర
కున్నవాఁడ. 124

టీ. ఆనాగకుమారుఁడు = ఆపాఁపకూన, కృత అంజలి ఐ = చేతులు గట్టుకొన్నవాఁడై, ఏను, కర్కోటకుండు అనువాఁడను, కర్మవశంబునఁ = పాపకర్మవశముచేత, ఒక బ్రహ్మఋషిఁ = ఒక బ్రాహ్మణుఁడయి ఋషి

డైన వానిని; వుల్లంఘించి = మీాటి, తత్ శాపంబునన్ = ఆముని శాపంబువలన, ఏకడన్ = ఎచ్చోటికిని, కదలన్ — నేరక = కదలఁ జాలక, వున్నవాఁడను.

క. నాలుగు దెసలను దావ
జ్వాలావళి గవిసె మండి ♦ చానోప మహీ
పాలక ! నన్నొక సరసీ
కూలముఁ జేరంగ నెత్తి ♦ కొని పొమ్ము దయన్. 125

టీ. నాలుగుదెసలన్ = నలుదిక్కులను, దావజ్వాలఆవళి = కాఱుచిచ్చు మంటలయొక్క గుమి, కవిసెను = చుట్టుకొనెను, మండి; చాన్ = చావను, ఓపన్ = చాలను, మహీపాలక = ఓరాజా, నన్ను, ఒకసరసీకూలమునన్ = ఒక చెఱువుగట్టును; చేరంగన్=చేరునట్లు, దయన్ ప్రేమతో, ఎత్తికొని పొమ్ము.

వ. నన్నురక్షించిన నీకుఁ బ్రియంబు సేయనోపుదుననిన వాని నెత్తికొనిపోవం జులుకనై యంగుష్ఠమాత్ర శరీరుండై యున్న కర్కోటకు నెత్తికొని నలుండతిత్వరితగతి నరిగి దావవర్జితంబైన యొక్కసరోవర సమీాపంబున విడువంబోయిన నింకను బదియడుగు లరుగుము నీకు శ్రేయఃప్రాప్తిఁ జేసెద ననిన నడుగు లెన్నుకొనుచుం బోయి పదియవయడుగున నప్పాముచేత దష్టుండై తనరూపంబు విడిచి వికృతరూపంబుతో నున్న యన్నలునకుం గర్కోటకుం డాత్మరూపంబుఁ జూపి యిట్లనియె నయ్యా! నీవు నాచేత విషపీడితుండవైతి

నని దుఃఖింపవలదు. నిన్నొరు లెఱుంగిన నెగ్గగుం గావున వికృతశరీరుం జేసితి, నెంతకాలంబు నీశరీరంబున నావిషం బుండు నంతకాలంబును నీకు విషోరగ రాక్షసపిశాచశత్రు నివహంబులవలని భయంబు లేదు. సర్వసంగ్రామజయం బును భార్యాసంగమంబును నెప్పటి యట్ల రాజ్యవిభవంబు నగు. నీ కెప్పుడేని నిజరూపంబు సేకొన నిష్టంబగు నప్పుడ నన్నుఁ దలంపు, మీవస్త్రంబు నీయొద్దకువచ్చు, దీని ధరి యించుకు, నిజరూపప్రాప్తి యగునని వరంబిచ్చి వెండియు నిట్లనియె. 126

టీ. నన్నున్, రక్షించినన్ = కాపాడినట్లయిన, నీకున్, ప్రియంబు; చేయన్ ఓపుదును = చేయఁజాలుదును, అనినన్, వానిని=ఆకర్కోటకుని, ఎత్తికొనిపోవన్, చులకనై = తేలికయై, అంగుష్ఠమాత్ర శరీరుఁడు= బొటన వేలంత శరీరముగలవాఁడై, వున్నన్ = వుండఁగా, ఎత్తికొని, నలుఁడు, అతి త్వరితగతిన్ = మిక్కిలి వేగముగల నడకతో, అరిగి = వెళ్ళి; దావ వర్జితము = కాఱుచిచ్చులేనిది, ఐన; ఒక్క, సరోవరసమీపంబునన్ = చెక్కనికొలని సమీపమున, విడువన్ పోయినన్ = వదలిపెట్టఁబోఁగా, ఇంకను, పది అడుగులు, అరుగుము, నీకు; శ్రేయః ప్రాప్తిన్; చేసెదను = మేలొనరించెదను. అనినన్; అడుగులు; ఎన్నుచున్ = లెక్కపెట్టుచు పోయి; పదియవఅడుగునన్ = పదియవ అడుగు పెట్టునప్పుడు; ఆప్పాము చేతన్; దష్టుండు ఐ = కఱవఁబడినవాఁడై; తన రూప్యంబు; విడిచి; వికృత రూపంబుతోన్ = మాఱువేసముతో; వున్న ఆనలునకున్; కర్కోట కుండు; ఆత్మరూపంబు = తననిజస్వరూపము; చూపి; ఇట్లు; అనియె; అయ్యా! ఓ నలమహారాజా! నీవు; నాచేన్; విషపీడితుఁడను=విషముచే

నొప్పింపఁ బడినవాఁడను; ఐతిని, అని; దుఃఖింపవలదు. నిన్నున్; ఒరులు = ఇతరులు; ఎఱింగినన్ = తెలిసికొనిరేని; ఎగ్గు = కీడు; అగున్; కావున; వికృతశరీరున్; మాఱినయాకారంబుగలవానినిఁగా; చేసితిని. ఎంతకాలంబు నీశరీరంబునన్, నావిషంబు; వుండును = వుండునో; అంతకాలంబును = అంతవఱకున్; నీకున్; విషో...భయంబు-విషవురగ = విషముగలపాములు, రాక్షసులు; పిశాచులు శత్రువులు వీరివలని భయంబులేదు. సర్వసంగ్రామ జయంబును = అన్నియుద్ధంబులయందు జయమును, భార్యాసంగమంబును = భార్యతోఁ గూడికయు; ఎప్పటియట్లు ఆ = యథాప్రకారముగా, రాజ్య విభవంబును = రాజ్యసంపదయును, అగును, నీకున్; ఎప్పుడేనిన్ = ఎప్పుడైనను, నిజరూపంబు = స్వకీయరూపమును, చేకొనన్ = కైకొనుటకు; ఇష్టంబు = కోరిక, అగున్ = కలుగునో, అప్పుడు ఆ = ఆవెంటనే, నన్నున్; తలంపుము, ఈవస్త్రంబు; నీయొద్దకున్; వచ్చును, దీనిన్; ధరియించుచున్ = కట్టుకొనఁగా, నిజరూపప్రాప్తి = సొంతరూపంబు నొందుట; అగున్; అని; చెప్పి వెండియున్; ఇట్లు; అనియెన్.

## మధ్యాక్కర.

ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు మ ♦ హీశుఁ డిక్ష్వాకు
కులజుండు నీకు సేవ్యుఁడగు నాతనిఁ ♦ గొలిచి యుండుండు
మలయు కీవతనికి నశ్వహృదయాఖ్య ♦ మగువిద్య యిచ్చి
వెలయ నతనిచే నక్షహృదయ మ ♦ న్విద్యఁ జేకొనుము.

టీ. ఇలన్ = పుడమియందు, ఇక్ష్వాకుకులజుఁడు = ఇక్ష్వాకువంశమున బుట్టినవాఁడు; ప్రసిద్ధుఁడు = కీర్తి చెందినవాఁడు, అను, ఋతుపర్ణుఁడు అనెడు మహీశుఁడు = రాజు, (కలడు, అతఁడు,) నీకున్ = నీచేత, సంసేవ్యుండు = చక్కఁగాఁ గొలువఁదగినవాఁడు, అగున్, ఆతనిన్, = ఆఋతుపర్ణుని; కొలిచి

అందున్ = అతనియొద్ద, అలయక=బడలిక, నొందక యుండుము, ఈవు; అతనికిన్, అశ్వహృదయఅఖ్యముఅగువిద్య = అశ్వహృదమను పేరుగలవిద్యను, ఇచ్చి=ఉపదేశించి; అతనిచేన్ = అతనివలన, అశ్వహృదయము అనువిద్యన్; చేకొనుము = గ్రహింపుము.

వ. మఱియు బాహుకుండను నామంబుతో సూతవృత్తినుండుమని హితోపదేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుండైనఁ దద్వచనంబున నలుం డయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణునిం గని యేను బాహుకుండనువాఁడ నశ్వశిక్షయందుఁ గుశలుండ, నన్న సంస్కారంబును శిల్పంబులు పెక్కులు రచియింపనేర్తు భవత్సేవార్థినై వచ్చితిననిన వానికి ఋతుపర్ణుం డిట్లనియె. 128

టీ. మఱియు, బాహుకుండుఅను, నామంబుతోన్ = పేరుతో, సూతవృత్తిన్ = సారథ్యముచేయు కొలువునందు, ఉండుము; అని, హితఉపదేశంబుచేసి=మేలుపలుకులు చెప్పి, కర్కోటకుండు; అదృశ్యుండుఐనన్=కనఁబడకపోఁగా, తత్ వచనంబునన్=ఆకర్కోటకునిమాట చొప్పున; నలుండు, అయోధ్యాపురంబునకున్, చని; ఋతుపర్ణున్, కని; ఏను; బాహుకుండు; అనువాఁడను, అశ్వశిక్షయందున్=గుఱ్ఱములను చక్కఁబఱచుటయందు; కుశలుండను = నేర్పరిని, అన్నసంస్కారంబును=వంటచేయుటయు, శిల్పంబులం పెక్కులు=చేతిపనులు అనేకములు; రచియింపన్-నేర్తున్=చేయగలను, భవత్ సేవఅర్థినిఐ = మీవద్ద కొలువుఁ గోరినవాఁడనై; వచ్చితిని. అనినన్; వానికిన్; ఋతుపర్ణుండు; ఇట్లనియెన్.

క. నాయొద్ద నుండెదేని మ
దీయ రథాశ్వముల గమన ♦ ధృతి శీఘ్రముగాఁ

జేయుము నావుడు నట్టుల
చేయుదు నని నలుఁడు వాని ♦ సేవించె మదిన్. 129

టీ. నాయొద్దన్; ఉండెదవేని = వుందువేని; మదీయ...ధృతి-మదీయ=నావైన; రథఅశ్వ=తేరిగుఱ్ఱములయొక్క, గమన=పోకలయందు; ధృతి=దిట్టతనము; శీఘ్రముగాన్=త్వరగా; చేయుము=కలిగింపుము, నావుడున్ = చెప్పఁగా; అట్టులఅ = అప్రకారమే, చేసెదను, అని; నలుఁడు; వానిన్ = ఋతుపర్ణుని; మదిన్ = అపేక్షతో=ఇష్టముతో; సేవించెన్=కొలిచెను.

వ. ఇట్లు ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుండై దుష్టాశ్వంబుల వశగతంబులఁజేయుచు నశ్వవరంబుల నారోహణంబుల శిక్షించుచు రసవంతంబుగ నన్నసంస్కారంబుసేయుచు ఋతుపర్ణుచేత నియుక్తులైన వార్ష్ణేయజీవలులు తనకు సహాయులుగాఁ బ్రచ్ఛన్నుండై యుండి యొక్కనాఁ డేకాంతంబున దమయంతిం దలపోసి తనరాకఁ దలంచి. 130

టీ. ఇట్లు, ఋతుపర్ణునొద్దన్; అశ్వ అధ్యక్షుఁడై=గుఱ్ఱముల విచారణాధికారియై; దుష్టఅశ్వంబులన్=చెడ్డగుఱ్ఱములను, వశగతంబులన్ చేయుచున్=లోఁబఱచుకొనుచు, అశ్వవరంబులన్=మేటిగుఱ్ఱములను,ఆరోహణంబులన్=సవారులను; శిక్షించుచున్=నేర్పుచు; రసవంతంబుగన్=రుచిగలిగియుండునట్లు; అన్నసంస్కారంబు-చేయుచున్ =వంటవార్పులు చేయుచు; ఋతుపర్ణునియుక్తులు=ఋతుపర్ణమహారాజుచే నేర్పరుపబడినవారు; అయిన వార్ష్ణేయజీవలులు=ఆపేరుగలవారు; తనకున్, సహాయులు కాన్ = తోడై యుండఁగా; ప్రచ్ఛన్నుండై ఉండి = దాగియుండి; ఒక్కనాఁడు; ఏకాంతమునన్ = ఒంటరిగా; దమయంతిన్; తలపోసి = తవంచుకొని; తనరాకన్ = తానువిడిచివచ్చుటను; తలఁచి=ఎంచుకొని. (పై ప. అ.)

సీ. ఇభరాజగమన! నీ ♦ వెందుల కరిగితి
వుడురాజవదన! యెం ♦ దున్న దాన
వబల! యెవ్వరిచేత ♦ నడవులలోఁ బట్టు
వడి తశనాపేక్షఁ ♦ బఱచుచున్న
యుగ్రమృగంబుల ♦ యుదరంబులో నున్న
దానవే నీ తల్లి ♦ దండ్రులొద్ద
ధృతి నున్నదానవే ♦ దేశాంతరంబుల
నున్నదానవె యంచు ♦ నుదితమదన
ఆ. హతి విమోహితాత్ముఁ ♦ డై హృదయేశ్వరిఁ
దలఁచి రాత్రియెల్లఁ ♦ దాపమునను
నిద్ర లేక వంది ♦ నిట్టూర్పు లూర్చుచు
నుండె నలుఁడు శోక ♦ ముత్కటముగ. 131

టీ. ఇభరాజగమన = మేటిఏనుఁగువంటి నడకగలదానా; నీవు; ఎందులకున్ : అరిగితివి; ఉడురాజవదన = చంద్రబింబమువంటి ముఖము గలదానా! ఎందున్; ఉన్నదానవు. అబల = ఓచిన్నదానా; అడవులలోన్ = వనములయందు; ఎవ్వరిచేతన్; పట్టుపడితి = చిక్కికొంటివి, అశనాపేక్షన్ = ఎరమీఁదికోరికతో, పఱచుచున్న ఉగ్రమృగంబుల వుదరంబులోన్ = పరుగెత్తుచుండు భయంకరమృగంబుల కడుపులోపల, వున్నదానవే = వున్నావా? నీతల్లిదండ్రులకడన్; ధృతిన్ = ధైర్యముతో, వున్నదానవే, దేశాంతరంబులన్ = ఇతరదేశములందు; వున్నదానవే = వున్నావా, అంచున్ = అనిచెప్పుచు; నలుఁడు; శోకము; వుత్కటముగాన్ = హెచ్చుఁగా, వుదిత...త్ముఁడై - వుదిత = హెచ్చిన; మదన = మన్మథబాధచేత, విమోహిత = మైమరపు గలిగిన, ఆత్ముఁడై = మనస్సుగలవాఁడయి; హృదయ ఈశ్వరిన్ = దమయంతిని; తలఁచి; రాత్రియెల్లన్ = రాత్రి

యంతయు; తాపమునను = మన్మథసంతాపముచే; నిద్ర; లేక; వంది = వాడిపోయి; నిట్టూర్పులు; ఉర్చుచు = విడుచుచు; వుండెను.

వ. అతని ప్రలాపంబు విని జీవలుం డాత్మగతంబున. 132

టీ. అతనిప్రలాపంబు = ఆతనివదరుటను; విని; జీవలుఁడు; ఆత్మగతంబునన్ = తనమనస్సులోపల.

క. అఱపొఱడుఁ గుఱుచ చేతులు
నొఱవ శరీరంబుఁ గలిగి ♦ యొరులకుఁ జూడం
గొఱగా కుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు ♦ యువతీప్రియుఁడై. 133

టీ. ఇతఁడు = ఈబాహుకుఁడు, అఱపొఱడున్ = సగముగూనును, కుఱుచచేతులును = పొట్టిచేతులును, ఒఱశరీరమును = వంకరశరీరముగలిగి, ఒరులకున్ = ఇతరులకు, చూడన్ కొఱకాక ఉండియున్ = చూచుటకసహ్యుఁడుగా నున్నను, యువతీప్రియుఁడు ఐ = వయసు చిన్నదానికిష్టుఁడై, మన్మథునొరపులన్ = మన్మథబాధలయందు, పడియెడున్ = చిక్కియున్నాఁడు.

వ. వీనిచేతఁ దలంపబడియెడు వనిత వీనికంటె లెస్సగాకున్నె యనుచు బాహుకునొద్దకు వచ్చి నీతలంచుచున్న భార్యకు నీకు నేలవియోగంబయ్యెనని యడిగిన బాహుకుండిట్లనియె.

టీ. వీనిచేతన్, వరియింపఁబడియెడు వనిత = కోరఁబడుసుందరి, వీనికంటెన్, లెస్స = అందమయినది, కాకఉన్నె = కాకుండునా, అనుచున్, బాహుకునొద్దకున్, వచ్చి, నీతలఁచుచున్న భార్యకున్ = నీవు స్మరించెడిభార్యకును, నీకున్, ఏల, వియోగంబు = ఎడబాయుట, అయ్యెను = కలిగెను, అని, అడిగినన్, బాహుకుఁడు, ఇట్లు, అనియెన్.

ఆ. నన్నుఁ జూచి నగరె ♦ నలినాక్షి నాకేల
విప్రయోగమేల ♦ వినవె తొల్లి
యేలయో యెఱుంగ ♦ నేను మందప్రజ్ఞుఁ
డను భటుండు తన ల ♦ తాంగి బాసి. 135

టీ. నన్నున్, చూచి, నగరు ఎ = (జనులు) నవ్వరా ? నలినఅక్షి = కమలనేత్రయగు సుందరి, నాకున్, ఏల = ఎందుకు, విప్రయోగము = ఎడబాయుట, ఏల వినవే. (వినుము-ఏ) = వినుమయ్యా, ఏలఓ = ఎందుకో, నేను, ఎఱుఁగను, తొల్లి = పూర్వము, మందప్రజ్ఞుఁడు = మూఢబుద్ధిగలవాఁడు, అను భటుండు = అనుబంటు, తనలతాంగిన్ = తనప్రియురాలిని, పాసి.

వ. దాని నన్వేషించి యెందునుం గానక ప్రలాపించినం దత్ప్రకారం బే ననుకరించితినని చెప్పి యిట్లయోధ్యాపురంబున బాహుక నామంబుతోఁ బ్రచ్ఛన్నుండై నలుండుండె నంత నట విదర్భేశ్వరుండు నలు రాజ్యభ్రంశంబు విని కూఁతురు నల్లుండు నెటవోయిరో యెట్లున్నవారో యని శోకించి. 136

టీ. దానిన్; అన్వేషించి = వెదకి, ఎందును = ఎచ్చటను; కానక ప్రలాపించినన్ = విలపింపఁగా, తత్ప్రకారంబు = ఆవిధముగా, ఏను, అనుకరించితిని = నటించితిని, అని, చెప్పి, ఇట్లు, అయోధ్యాపురమునన్ = అయోధ్యా పట్టణమునందు, బాహుకనామంబుతోన్ = బాహుకుండనెడి పేరుతో, ప్రచ్ఛన్నుఁడు ఐ = మఱఁగినవాఁడై, నలుఁడు, ఉండెను, అంతన్ = తర్వాత; అటన్ = అచ్చట, విదర్భఈశ్వరుఁడు = విదర్భరాజగు భీముఁడు, నలురాజ్యభ్రంశంబు = నలునిరాజ్యము కోల్పోవుటను, విని, కూతురును, అల్లుడును, ఎటన్ = ఎచ్చటికి, పోయిరో; ఎట్లు; వున్నవారో, అని; శోకించి = విలపించి-

క. వారల రోయఁగఁ బంచె న
పారబలుం డిష్టులైన ♦ బ్రాహ్మణుల సదా
చారుల విద్వాంసుల స
త్కారంబులఁ దనిపి వారిఁ ♦ గడు నెయ్యముతోన్. 137

టీ. అపారబలుఁడు=అంతులేని బలముగలవాఁడు, (భీముఁడు,) సదాచారులన్ = మంచియాచారముకలవారిని, విద్వాంసులన్ = అన్నిటిని చెలిసినవారిని, ఇష్టులు ఐన బ్రాహ్మణులను=తనయందుఁ బ్రేమగల విప్రులను, సత్కారంబులన్=మర్యాదలచే; తనిపి=తృప్తినొందించి, వారిన్ = బ్రాహ్మణులను, కడు నెయ్యముతోన్ = ఎక్కువ సంతోషముతో; వారలన్ = ఆ నలదమయంతులను; రోయగన్ = వెదకుటకై, పంచెన్ = పంపెను.

వ. మఱియు నలదమయంతు లున్నచోటెఱింగి వచ్చినవారికి వేయిగద్యాణంబు లిత్తుననియు వారలం దోడ్కొనివచ్చు వారికి గోసహస్రంబులు, నగ్రహారంబులు నిత్తుననియుఁ బలికి పంచిన. 138

టీ. మఱియు, నలదమయంతులు; వున్నచోటు; ఎఱింగి; వచ్చినవారికిన్, వేయిగద్యాణములు=వేయివరహాలు, ఇత్తును అనియున్, వారలన్ = తోడ్కొని=పిల్చుకొని; వచ్చువారికిన్; గోసహస్రంబులు = పెక్కుగోవులను; అగ్రహారంబులును = మంచిగ్రామములును, ఇత్తును, అనియు, పలికి పంచినన్ = పంపఁగా.

క. జగతీచక్రమునం గల
నగర మహాగ్రామ పక్క ♦ ణంబులు గలయన్

జగతీ దేవోత్తములి
మ్ముగ రోసిరి నిఖిలదేశ ♦ ములఁ గరిగి వడిన్. 139

టీ. జగతీదేవతవుత్తములు = బ్రాహ్మణశ్రేష్ఠులగువారు, నిఖిలదేశములన్ = అన్ని దేశములకును; వడిన్ = శీఘ్రముగా, అరిగి, జగతీచక్రమునన్ = భూమండలమునందు, కల = వున్న, నగర...ఇంబులు-నగర = పట్టణములు, మహాగ్రామ = గొప్పయూళ్ళు, పట్టణంబులు = పల్లెలు, కలయన్ = అంతటను, ఇమ్ముగన్ = చక్కఁగా, రోసిరి = వెదకిరి.

వ. అందు సుదేవుండను బ్రాహ్మణుండు చేదిపతియైన సుబాహుపురంబునకుం జని పుణ్యాహవాచనంబు సేయంబోవు బ్రాహ్మణులతోఁ రాజగృహంబు సొచ్చి యంతఃపురంబున సునందాసహితయై యున్నదాని ధూళిధూసరయైన ధూమజాలనిబద్ధయైన యగ్నిప్రభయునుం బోలె నీలాభ్రసంవృతంబైన చంద్రరేఖయుంబోలె బహుపంకనిమగ్నయై మృణాళియుంబోలె, నేర్పడకున్నను, దదీయ భ్రూయుగమధ్యగతంబైన సూక్ష్మలక్షణం బిమ్ముగా నిరీక్షించి దమయంతిగ నెఱింగి యాత్మగతంబున నిది పతివిముక్తయైశుష్కప్రవాహంబైన నదియునుంబోలె శూన్యకమలంబైన నలినియునుంబోలె నొప్పకుండియుఁ దన పతివ్రతాత్వంబున నొప్పుచున్నది. 140

టీ. అందున్ = వారిలో, సుదేవుండు, అను బ్రాహ్మణుండు, చేదిపతి = చేదిదేశపురాజు, ఐనసుబాహుపురంబునకున్; చని, పుణ్యాహవాచ

నంబు=ఇంటి యశుచిత్వము పోవుటకై చేయు నొక కర్మవిశేషమును, చేయింపబోవు బ్రాహ్మణులతోన్; రాజగృహంబు = రాచనగరు, చొచ్చి; అంతఃపురమునన్; సునందాసహితయై = సునందతో గూడినదై; వున్నదానిన్ = వున్నదియు, ధూళిధూసర ఐ = దుమ్ముచే గప్పబడినదై; ధూమ...బద్ధ ఐన-ధూమ = పొగయొక్క, జాల = సమూహముచేత, నిబద్ధ ఐన = క్రమ్మబడినది యగు, అగ్నిప్రభయు పోలెన్ = నిప్పుమంట వలెను; నీల...తంబుఐన-నీల=నల్లని; అభ్ర=మేఘములచేత, సంవృతంబు ఆయిన = కప్పబడినదియగు, చంద్రరేఖవలెను, బహు...నిమగ్నఐన-బహు = విస్తారమైన, పంక=బురదయందు; నిమగ్న ఐన=మునిఁగిన, మృణాళియున్ పోలెన్ = తామరతూఁడు వలెను, ఏర్పడకవున్నను=స్పష్టముగాఁ దెలియకున్నను, తదీయ...తంబు ఐన-తదీయ=దానివగు; భ్రూ=కనుబొమ్మల; యుగ=జంటయొక్క, మధ్య=నడుమ, గతంబుఅయిన=వున్నట్టి, సూక్ష్మలక్షణంబు=సన్నని మచ్చను; ఇమ్ముగాన్=బాగుగా; నిరీక్షించి=చూచి, దమయంతిగన్-ఎఱింగి; ఇది, పతివియుక్తయై=భర్తనుఎడబాసి; శుష్క-ప్రవాహంబుఐన=నీటిపారుదలలేని; నదియునున్ పోలెన్=ఏటివలెను, శూన్యకమలంబు = తామరపువ్వులులేని; నళినియున్-పోలెన్=తామరతీఁగవలె; ఒప్పకుండియున్ = ప్రకాశింపకుండినను, తనపతివ్రతాత్వంబునన్=తనపాతివ్రత్యముచేత; ఒప్పుచున్నది = ప్రకాశించుచున్నది.

తే. అనపహార్యంబుఁ దేజోమ ♦ యంబు సర్వ
గుణములకు నలంకారంబు ♦ గురుతరంబు
భామలకుఁ బతిభక్తియ ♦ పరమమైన
భూషణం బిట్టివే పెఱ ♦ భూషణములు. 141

టీ. భామలకున్=స్త్రీలకు, పతిభక్తి అ = మగనియందుఁ బ్రేమయొక్క; అనపహార్యంబు = శత్రువులచే దొంగిలింపరానిదియు, తేజోమయంబున్ =

కాంతిస్వరూపమైనదియు, సర్వగుణంబులకున్ = సమస్తసుగుణములకును, గురుతరంబు = మిక్కిలిముఖ్యమైన; అలంకారంబు = సొమ్ము, పరమమునైన = గొప్పదైన భూషణము, పెఱభూషణములు = తక్కినసొమ్ములు, ఇట్టివే = ఈలాగుండునవియా. (కావనుట)

వ. రోహిణికి జంద్రసమాగమంబునుంబోలె దీనికి భర్తృసమాగమం బెన్నం డయ్యెడునో తుల్యశీలవయోరూపాభిజాత్యులైన నలదమయంతు లొక్కెటనుండంజూచి విదర్భేశ్వరుం డెన్నండు కృతార్థుం డయ్యెడునో యంచు నల్లన దమయంతి కిట్లనియె. 142

టీ. రోహిణికిన్ = రోహిణీదేవతకు, చంద్రసమాగమంబునుంబోలెన్ = చంద్రునితోకూడికవలె, దీనికిన్, భర్తృసమాగమంబు = పెనిమిటితోడికూడిక, ఎన్నడున్, అయ్యెడున్ ఓ = కలుగనున్నదో; తుల్య...జాత్యులు-తుల్య = సమానమైన, శీల = మంచినడవడి, వయః = ఈడు; రూప = ఆకారము, అభిజాత్యులు = సత్కులంబునఁ బుట్టుక యనునవి గలవారలు, ఐన నలదమయంతులు, ఒక్కటన్ = ఒక్కచోట, వుండన్ = వుండఁగా, చూచి. విదర్భేశ్వరుఁడు = భీముఁడు, ఎన్నండు; కృతార్థుఁడు = తానుకోరినకోరికనుపూర్తిచేసికొన్నవాఁడు, అయ్యెడున్ ఓ = కాగలడో; అంచున్, అల్లన్-అ = మెల్లగా, ఇట్లు, అనియె.

తే. అవ్వ! నీతల్లిదండ్రుల ♦ కాత్మజులకు
బంధుజనులకుఁ గుశలంబ ♦ భామ! నీదు
కుశల మెఱుఁగనంతకు వగఁ ♦ గూరి వగచు
చున్నవారు వారలవంత ♦ యుడుఁగు నింక. 143

టీ. అవ్వ=అమ్మా! నీ తల్లిదండ్రులకున్, ఆత్మజులకున్=బిడ్డలకు, బంధుజనులకున్=చుట్టములకును, కుశలంబులు=క్షేమమే, భామ=ఓసుందరీ వారు; నీదుకుశలము=నీక్షేమము, ఎఱుఁగునంతకున్ = తెలియువరకు వగన్ భూరి=విచారంబునొంది, వగచుచున్నవారు = దుఃఖపడుచున్నారు. ఇంకను వారలవంత=వారిదుఃఖము, వుడుగును = తీరును.

వ. దేవీయేను భవద్భ్రాతృసఖుండ సుదేవుండను బ్రాహ్మణుండ విదర్భేశ్వరుండునీయున్నచోటెఱుంగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నేనిందులకు వచ్చి నాపుణ్యంబున నిన్నుఁ గంటి ననిన దమయంతి వాని నెఱింగి తన తల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నంజూచి యేలొకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్నయదియని సునంద రాజమాతకుం జెప్పిపుచ్చిన. 144

టీ. దేవీ = ఓరాణీ, ఏను, భవత్ భ్రాతృసఖుండను = నీయన్నకు మిత్రుఁడను, సుదేవుండు, అను బ్రాహ్మణుఁడు, విదర్భఈశ్వరుఁడు = విదర్భ రాజు (నీతండ్రి) నీయున్నచోటు=నీవున్నతావు, ఎఱుఁగన్, పెక్కండ్రు= అనేకులను, బ్రాహ్మణులను, పుచ్చినన్=పంపఁగా, నేను, ఇందులకున్= ఈపురంబునకు, వచ్చి, నాపుణ్యమునన్ = నా యదృష్టవశంబున, నిన్నున్ కంటిని, అనినన్, దమయంతి, వానిన్=ఆసుదేవుని, ఎఱిఁగి = గుఱుతించి, తనతలిదండ్రులన్, బాంధవులన్, ప్రత్యేకంబు అ = వేర్వేరుగా, (కుశలంబు = క్షేమము) అడిగి, అశ్రుజలంబులు = కన్నీరు, వురులన్=కారునట్లు ఏడ్చుచున్నన్, చూచి, ఏలకో (ఏల-ఓ) = ఎందుకో, ఇప్పుడు, సైరంధ్రి, ఏడ్చుచున్నయది, అని సునంద, రాజమాతకున్, చెప్పిపుచ్చినన్ = చెప్పి పంపగా.

క. చనుదెంచె నంతిపురమున
వనితానివహంబుతోడ ♦ వారిజదళలో
చన రాజమాత నృపనం
దనయగు దమయంతికడకుఁ ♦ దద్దయువేడ్కన్. 145

టీ. వారిజదళలోచన = తామరఱేకులవంటి కన్నులుగలదగు, రాజమాత = రాజుగారితల్లి, వనితానివహంబుతోడన్ = స్త్రీలగుంపుతోగూడ, అంతిపురంబునన్ = అంతఃపురంబునందు, నృప, నృపనందన అగు = రాజపుత్రియగు, దమయంతికడకున్. తద్దయున్ = మిక్కిలి, వేడ్కన్ = వుత్సాహముతో, చనుదెంచెను.

వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణునిన్ దమయంతిం జూచి రాజమాత బ్రాహ్మణున కిట్లనియె నయ్యా యిది యెవ్వనికూఁతు? రెవ్వనిభార్య? యేమికారణంబునఁ దనభర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపుచున్నయది? దీని నీవెట్లెఱింగితి? యిక్కోమలి నామంబేమి? యని యడిగిన సుదేవుం డిట్లనియె 146

టీ. ఇట్లువచ్చి; తమలోన్ = వారి లోలోపల, మాటాడుచున్న బ్రాహ్మణునిన్, దమయంతిన్, చూచి; రాజమాత; ఇట్లు అనియెను, అయ్యా = ఓ బ్రాహ్మణుఁడా; ఇది; ఎవ్వనికూఁతురు, ఎవ్వనిభార్య; ఏమి కారణంబునన్ = ఏహేతువుచేత; తన భర్తను; బాంధవులను; పాసి; పుణ్యవ్రతంబులు = పుణ్యప్రదములైననోములు, సలుపుచున్నయది = చేయుచున్నది, దీనిని; నీవు; ఎట్లు ఎఱింగితివి, ఈకోమలినామంబు = ఈచిన్నదానిపేరు, ఏమి, అని, అడిగినన్, సుదేవుండు, ఇట్లు, అనియెన్.

మధ్యాక్కర.

నలినాక్షి యిది విదర్భేశునితనయ పు ♦ ణ్యశ్లోకుఁడైన
నలుదేవి దమయంతిసుమ్ము విధి కార ♦ ణంబున రాజ్య
చలితుఁడై నిజనాథుఁ డరుగఁదోడన ♦ చనె నను వార్తఁ
వెలయంగవిని వారి రోయఁబంచె భూ♦విభుఁడు బ్రాహ్మణుల.

టీ. నళిన అక్షి = తామరరేకులఁబోలు కన్నులుగల యోరాజమాతా, ఇది; విదర్భఈశుతనయ = విదర్భరాజు కూఁతురు; పుణ్యశ్లోకుఁడు = పవిత్రమైన కీర్తిగలవాఁడు; ఐన, నలుదేవి = నలునిరాణియగు; దమయంతిసుమ్ము = దమయంతికదా, విధికారణంబునఁ = దైవముయొక్క యాగ్రహంబువలన, నిజనాథుఁడు = తనపెనిమిటి; రాజ్యచలితుఁడు ఐ = రాజ్యమునుండి భ్రష్టుఁడయి, అరుగఁ = పోవఁగా; తోడనే = వెంటనేఁ చనెను, అను; వార్త = వృత్తాంతము; వెలయంగఁ బాగుగా; విని, భూవిభుఁడు = విదర్భరాజు; బ్రాహ్మణులను; వారిని; రోయఁ = వెదకుటకై, పంపెను.

వ. ఏనిందులకువచ్చి మీచేత సురక్షితయైయున్న యికోమ
లిఁజూచి దీనిభ్రూమధ్యంబునం బద్మనిభంబై విభూత్యర్థం
బుగా విధాతృనిర్మితంబైన పుణ్యలక్షణంబు పాంసుపటల
చ్ఛన్నంబయియున్న నుపలక్షించి రాజపుత్రింగా నెఱింగితి
ననిన సునంద శుద్ధోదకంబుల దానిభ్రూమధ్యంబు గడిగిన
నది విస్పష్టంబగుడు నందఱు నాశ్చర్యంబందిరంత. 148

టీ. ఏను; ఇందులకుఁ = ఇచ్చటికి వచ్చి; మీ చేతఁ; సురక్షిత ఐ ఉన్న ఈ కోమలిఁ = చక్కఁగా సంరక్షింపబడుచున్న యీసుకుమారిని.

చూచి; దీని భ్రూమధ్యంబునన్ = దీనియొక్క కనుబొమలనడుమ, పద్మనిభంబై = కమలంబుఁబోలినదై; విభూతి అర్థంబుగాన్ = ఐశ్వర్యముకొఱకును; విధాతృనిర్మితంబున్ = బ్రహ్మచేఁజేయఁబడినది; ఐనపుణ్యలక్షణంబు = శుభచిహ్నము; పాంసుపటలచ్ఛన్నంబు ఐ ఉన్నన్ = దుమ్ముయొక్క రాశిచేఁగప్పఁబడినదియై యుండఁగా; ఉపలక్షించి = చూచి; రాజపుత్త్రిన్ కాన్ = దమయంతినిగా, ఎఱిఁగితిని; అనినన్; సునంద; శుద్ధ ఉదకములన్ = తేటనీటితో; దాని భ్రూమధ్యంబున్ = దాని కనుబొమలు నడుమను కడిగినన్ = కడుగఁగా, అది; విస్పష్టంబు అగుడున్ = స్పష్టముగాఁ దెలియఁగా; అందఱును; ఆశ్చర్యము నొందిరి, అంతన్ = పిమ్మట.

సీ. ఆనందభరితాత్మ ♦ యై రాజమాత య
క్కమలాక్షిఁ బ్రీతితోఁ ♦ గౌఁగిలించి
కొని తల్లి! నీవు నా ♦ కూఁతుర వేను నీ
జననియుఁ జేర్మిద ♦ శార్ణరాజు
తనయుల మదియు వి ♦ దర్భేశుసతి యయ్యె
నే వీరబాహున ♦ కింతినైతి
ననిన నయ్యవ్వకు ♦ నతివినయంబుతో
నలుదేవి మ్రొక్కె సు ♦ నంద నెత్తి
ఆ. కొని కరంబు నెమ్మిఁ ♦ గొన్ని దినంబులం
దుండి యిట్టులనియె ♦ నొక్కనాఁడు
దేవి! యిదియు నదియు ♦ ధృతి నాకుఁ బుట్టిన
యిండ్ల కడుసుఖంబ ♦ యిందు నందు

టీ. రాజమాత = రాజుగారితల్లి, ఆనందభరిత ఆత్మ ఐ = సంతోష ముతో నిండిన మనస్సుతోఁ గూడికొనినదై ; ఆకమలాక్షిన్ ఆదమయంతిని; ప్రీతితోఁ = గారాబముతో, కౌఁగిలించికొని, తల్లీ = ఓచిన్నదానా, నీవు, ఏనున్, నీజననియున్ = నీతల్లియు, పేర్మిఁ, దశార్ణ మహారాజునకుఁ గుమార్తెలము, ఆదియున్ = నీతల్లియు, విదర్భఈశుపతి = భీమునిపట్టపుదేవి, అయ్యను, నేను, వీరబాహునకుఁ ; ఇంతిని ఐతిని, అనినఁ = అని చెప్పఁగా, ఆఅవ్వనుఁ = ఆరాజమాతకు, అతివినయంబుతోఁ = ఎక్కువఅడఁకువతో; నలుదేవి = దమయంతి, మ్రొక్కి ; సునందను, ఎత్తికొని = కొంతసేపు తినయొడిలోఁ గూర్చుండబెట్టుకొని; కరంబు = మిక్కిలి, నెమ్మిఁ = ప్రేమతో; కొన్ని దినంబులు, అందుఁ = ఆచేదీశునిపురంబున, ఉండి, ఒక్కనాఁడు, ఇట్టులు; అనియెఁ; దేవి - ఓతల్లీ; ఇదియుఁ = ఈపురంబును; అదియుఁ = ఆవిదర్భపురంబును, ధృతిఁ = సంతోషకరంబులైన, నాకుఁ ; పుట్టినయిండ్లు అ = పుట్టినిండ్లే; ఇందున్ అందుఁ = ఇచ్చటను అచ్చటను; కడుఁ = మిక్కిలి, సుఖంబు అ = సుఖమే; (కలదు) ఎక్కడనున్నను నొక్కటియే యని తాత్పర్యము.

వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులంజూచెదు వేడ్కయుల్లంబునం బుట్టిన యది విదర్భకుంబోయెద నానతిమ్మని కృతాంజలియైన దమయంతి నతిస్నేహంబున సుబాహుజనని సుతప్రేషితబలంబుతో స్వర్ణరత్నమయ యానంబున నునిచి పుచ్చిన. 150

టీ. అయినను = అట్లొక్కటియైనను; తల్లిదండ్రులను; అనుజులన్ = తమ్ములను; ఆత్మజులఁ = బిడ్డలను; చూచెదు వేడ్క = చూడఁగోరిక ; ఉల్లంబునన్ = మనసున, పుట్టినయది; విదర్భకు; పోయెదను, ఆనతిమ్ము = సెలవొసంగుము. అని, కృతఅంజలి = దోసిలికట్టినది, అయిన దమయంతిఁ, అతిస్నే

హంబునఁ = ఎక్కువ చెలిమితో, సుతప్రేషితబలంబుతోన్, సుత = కొడుకుచే; ప్రేషిత=పంపఁబడిన, బలంబుతోన్ = సేనతో; స్వర్ణరత్నయానంబునన్ = బంగారుతోఁజేసిన రత్నములు చెక్కిన పల్లకియందు, ఉనిచి పుచ్చినన్ = గూర్చుండఁబెట్టి పంపఁగా.

ఉ. భామ విదర్భకేఁగి తన ♦ బంధుజనంబులయొద్ద నుండియుం
గోమల దేహసౌఖ్యముల♦కుఁ వెలియై మలినార్ధవస్త్రముఁ
భూమిరజంబు నంగమునఁ ♦ బొల్పుగుచుండఁగనుండె జీవిత
స్వామిని జేశుఁ జూచుదివ♦సంబులుగోరుచుసువ్రతంబుతోన్.

టీ. భామ = దమయంతి; విదర్భకుఁ, ఏఁగి; తనబంధుజనంబుల యొద్దఁ, ఉండియు; కోమలదేహ సౌఖ్యములకుఁ = సున్నితములైన శరీర సుఖములకు; వెలియై=దూరురాలై; మలిన అర్ధవస్త్రముఁ = మురికగలదైన సగముబట్టయును, భూమిరజంబు= నేలదుమ్ము; అంగమునఁ =శరీరమునందు; పొల్పగుచుండఁ=అందము గల్గించుచుండఁగా; జీవితస్వామిఁ = తనప్రాణనాథుఁడయిన; నిజఈశుఁ = తనప్రియుని; చూచుదివసంబులు = చూచుదినంబులు, కోరుచుఁ = (ఎన్నఁడఁవచ్చునాయని) యెదురుచూచుచు, సువ్రతంబుతోఁ =మిక్కిలినిష్ఠతో; ఉండెను.

వ. ఇట్లు భర్తృవియోగాతురయైన దమయంతి ప్రాణంబు భరియింపనోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దన జనని కిట్లనియె. 152

టీ. ఇట్లు భర్తృవియోగ ఆతుర ఐన = పెనిమిటి యెడఁబాటుచే నొచ్చినదైన; దమయంతి; ప్రాణంబు; భరియింపఁ ఓపక = నిల్పుకొనఁజాలక, ఒక్కనాఁడు; ఏకాంతంబునన్; తనజననికిఁ =తనతల్లికి; ఇట్లు; అనిరెను.

క. శోకాపనోదిఁ బుణ్య
శ్లోకు నలుని రోయఁ బనుపు • శుభచరితుఁ దదా
లోకన విహీననై పర
లోక కృతావాసనగుదు • లోకంబెఱుఁగన్. 153

టీ. శుభచరితున్ = మంచిప్రవర్తనగలవానిని, శోకఅపనోదిన్ = దుఃఖముపోఁగొట్టువానిని; పుణ్యశ్లోకున్ = పవిత్రమైనకీర్తిగలవానిని, నలునిన్; రోయన్ = వెదకుటకు; పనుపుము = ఆనతిమ్ము, తత్ ఆలోకనవిహీనను ఐ = ఆనలుని చూచుటలేనిదాననై; లోకంబు ఎఱుఁగన్ = జనులకందఱికిఁ దెలియునట్లు; పరలోకకృత ఆవాసను = పరలోకంబున నివాసముఁగలుగజేసికొన్నదానను; అగుదును. (ప్రాణములను బాసెదను. అని తా.)

వ. అనిన నదియును గూఁతునభిప్రాయంబు భీమున కెఱింగించిన
నాతండు నలుమార్గణంబున ఋజుమార్గులైన బ్రాహ్మ
ణుల నియోగించినం దనపతి నన్వేషింప నరుగు బ్రాహ్మ
ణులకు దమయంతి యిట్లనియె. 154

టీ. అనినన్; అదియున్ = ఆదమయంతియొక్క తల్లియు; కూఁతునభిప్రాయంబు = కుమార్తెయొక్క కోరికను; భీమునకున్ = తనభర్తకు, ఎఱింగించినన్, ఆతఁడు; నలుమార్గణంబునన్ = నలమహారాజును వెదకుటకై; ఋజుమార్గులు = చక్కనిదారియందుఁబోవువారు; ఐన (బ్రాహ్మణులను, నియోగించినన్ = ఉత్తరువుచేయఁగా, తనపతిన్; అన్వేషింపన్ = వెదకుటకు; అరుగు బ్రాహ్మణులకున్; ఇట్లు; అనియెన్.

ఆ. నైషధేశ్వరుండు ♦ నలుఁ డిప్పు డసమర్థుఁ
డగుటఁ జేసి తన్ను ♦ నన్యు లెఱుఁగ
కుండ నుండుఁ గాన ♦ యును సభాంతరముల
కరిగి యరిగి యిట్టు ♦ లనుఁడు మీరు. 155

టీ. నైషధఈశ్వరుఁడు = నిషధదేశమునకు రాజగు నలుఁడు, ఇప్పుడు, అసమర్థుడు అగుటచేసి = శక్తిచాలనివాఁడు గనుక; తన్నుఁ, ఇతరులు; ఎఱుంగక ఉండుఁ = తెలియకుండును, కానఁ = కాఁబట్టి, మీరు, ఉరు సభాఅంతరములకుఁ—ఉరు = గొప్పలైన, సభా = రాజులకొలువుకూటము, యొక్క, అంతరములకుఁ = నడిమిప్రదేశములను; అరిగి = పోయి; ఇట్టులు = ఈరీతి; అనుఁడు = చెప్పుడు.

సీ. సత్యనిత్యుండవు ♦ నతి నింతి వర్జించి
దానివస్త్రార్థంబుఁ ♦ దఱిగి నీవు
పరిధానముగఁ జేసి ♦ పాడియే పోవంగ
భార్య భర్తయు నాఁగఁ ♦ బరఁగు ధర్మ
మది మిథ్యయయ్యె నీ ♦ యందు నీకిట్టి ని
ర్దయబుద్ధి చేకొనఁ ♦ దగునె యట్టి
సాధ్వికిఁ గరుణాప్ర ♦ పన్నుండవగుమని
యెల్లచోఁ బలికిన ♦ నెవ్వఁడేని
ఆ. పలుకుఁబడఁగ నోడి ♦ ప్రతివచనం బిచ్చు
నతఁడు నలుఁడుగాఁగ ♦ నతిముదమున
నెఱిఁగి నన్ను నతని ♦ కెఱిఁగించి తోడ్కొని
రండు రానినాఁడు ♦ రండెఱింగి. 156

టీ. నీవు; సత్యనిత్యుఁడవు = సత్యముపల్కుటయే నిత్యవ్రతంబుగాఁ గలవాఁడవు, సతిన్ = పతివ్రతయగు, ఇంతిన్ = భార్యను, వర్జించి = వదలిపెట్టి, దానివస్త్రఅర్థంబున్ = దానియొక్క చీరలో సగముభాగము, తఱిగి = చించుకొని, పరిధానముగన్ = కట్టువస్త్రముగా, చేసి, పోవంగన్ = పోవుట, పాడియే = తగునా, భార్య = కాపాడఁదగినది, భర్త = కాపాడువాడు; అను ధర్మముఅది = అనుప్రసిద్ధమైనన్యాయము, నీయందున్ = నీవిషయమున, మిథ్య = అబద్ధము, అయ్యెను, నీవున్ = నీవు; ఇట్టి, నిర్దయబుద్ధి = కనికరములేనితనము, చేసికొనఁదగునుఏ = అవలంబింపవచ్చునా? అట్టిసాధ్వికిన్ = అట్టిపతివ్రతయందు, (సప్తమ్యర్థకషష్ఠి.) కరుణాప్రసన్నుండవు = దయచేనను గ్రహము పొందినవాఁడవు; అగుము. అవి; ఎల్లచోన్ = అన్నిప్రదేశములలోను, పలికినన్ = చెప్పినట్లయితే, ఎవ్వఁడు ఏని = ఏపురుషుఁడైనను; పలుకున్ = మీరన్నమాటను; పడఁగన్ ఓడి = పడజాలక; ప్రతివచనంబు = బదులుమాటను ఇచ్చునో, అతఁడనలుఁడుగాఁగన్ = నలుఁడని తెలిసికొని; ననున్, అతనికిన్, ఎఱింగించి, తోడ్కొనిరండు = వెంటబెట్టుకొనిరండు, రానినాఁడు = రానిపక్షమున; ఎఱిఁగి = (అతని సంగతి) తెలిసికొని, రండు.

వ. అని పంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతికఱపిన పలుకులెల్ల సకలదేశాధీశసభలం బలికియెందునుంగానక వచ్చిరందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుండు దమయంతి కిట్లని యొనేనయోధ్యకరిగి నీకఱపిన పలుకులెల్ల ఋతుపర్ణు సభం బలికిన నొక్క పురుషుండు కుఱుచచేతులవాఁడు ఋతుపర్ణునొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబువాఁడు శీఘ్రయానకుశలుండు సూపక్రియానిపుణుండు విరూపాంగుండు బాహుకుండను నశ్వశిక్షకుండు విని నన్ను నేకాంతంబునకుం బిలిచి వెలవెలనగుచు దీర్ఘనిశ్శ్వాసపురస్సరంబుగా నిట్లనియె. 157

టీ. అని; పంచినన్ = పంపఁగా; పనిపూని = ప్రయత్నముతోఁ; బ్రాహ్మణులు; దమయంతి; కఱపినపలుకులు ఎల్లన్ = నేర్పినమాటలన్నింటిని; సకలదేశసభలన్ = అన్నిదేశముల రాజుల కొలువుకూటములందు; పలికి, ఎందునన్ = ఎచ్చటను, కానకవచ్చిరి = చూడకవచ్చిరి, అందున్ = ఆ వెదుకఁబోయిన బ్రాహ్మణులలోఁ, పర్ణాదుఁడు అను బ్రాహ్మణుఁడు, దమయంతికిన్; ఇట్టు; అనియెను. నేను అయోధ్యకున్, అరిగి, నీకఱపినపలుకులు ఎల్లన్ = నీవు నేర్పినమాటలన్నింటిని; ఋతుపర్ణసభన్ = ఋతుపర్ణుని కొల్వుకూటంబునందు; పలికినన్ = మాటలాడఁగా; ఒక్కపురుషుఁడు; కుఱుచచేతులు గలవాఁడు = పొట్టిచేతులుగలవాఁడు, ఋతుపర్ణునొద్దన్! నూఱు గద్యాణంబుల జీవితంబువాఁడు = నూఱు వరహాల జీతమునకు కొల్వుకొల్చువాఁడు, శీఘ్రయానకుశలుండు - శీఘ్ర = తొందరగా, యాన = గుఱ్ఱములను నడుపుటయందు, కుశలుండు = నేర్పరి, సూపక్రియా = వంటచేయుటయందు, నిపుణుండు = నేర్పరి విరూప అంగుండు = రోఁతపడదగిన రూపంబు గలవాఁడు, బాహుకుఁడు అను అశ్వశిక్షకుఁడు = బాహుకుఁడను పేరుగల గుఱ్ఱములను నడకలను నేర్పువాఁడు, విని, నన్నుఁ; ఏకాంతంబునన్ = రహస్యస్థలంబునకు, పిలిచి, వెలవెలన్ అగుచు = ముఖమున కాంతిలేనివాఁడగుచు, దీర్ఘనిశ్వాసపురస్సరంబుగాన్ = పెద్దదైన నిటూర్పుతోఁ గూడ, ఇట్లు = అనియెన్.

ఆ. పురుషునందు దోష ♦ పుంజంబు గలిగిన
నెఱిఁగి యెద సహించు ♦ నేని భార్య
పురుషునం దభీష్ట ♦ భోగంబు దేహాంత
రంబునందు ధర్మ ♦ రతియుఁ బడయు. 158

టీ. పురుషునందున్ = భర్తయందు, దోషపుంజంబు = పెక్కు దోషములు, కలిగినన్ = ఉన్నను, ఎఱిఁగి = తెలివిగలదై, భార్య = పెండ్లాము, ఎదన్ = మనసునందు; సహించునేని = ఓర్చుకొన్నయెడల, పురుషు

లందున్; అభీష్టభోగంబు=కోరిన కోరికల ననుభవించుటయు, దేహాంతరంబు నన్ = దేహము వదలినప్పుడు; ధర్మరతియున్ = మోక్షమందాసక్తియు; పడయున్ = పొందును.

వ. అని యొండెద్దియుం బలుకక తననివాసంబునకుఁబోయెనని చెప్పిన విని పెద్దయుంబొద్దు చింతించి నలుండుకానివాఁడు ప్రతివచనం బేలయిచ్చు నింకను వలనుగలవారలం బంచి యాతని నిమ్ముగా నెఱుంగవలయునని జననీజనకుల యను మతంబున సుదేవు రావించి వాని కిట్లనియె. 159

టీ అని, ఒండు ఎద్దియున్ = ఇతరమేమియు; పలుకక; తన నివా సంబునకున్ = తనయునికి పట్టునకు; పోయెను, అని; చెప్పినన్ = చెప్పఁగా విని, పెద్దయున్ పొద్దు = చాలకాలము; చింతించి, నలుఁడు కానివాఁడు = నలుఁడుకాని పక్షమున, ప్రతివచనంబు = బదులుమాట, ఏల, ఇచ్చును, ఇంకను; వలను కలవారలన్ = ఉపాయశాలురను, పంచి = పంపి, ఆతనిన్ = ఆనలమహారాజును గూర్చి; ఇమ్ముగాన్ = బాగుగా, ఎఱుంగన్ వలయును, అని; జననీజనకుల యనుమతంబునన్ = తల్లిదండ్రుల యంగీకారము వలన; సుదేవుఁ; రావించి = పిలిపించి, వానికిఁ, ఇట్లు; అనియెఁ.

క. నన్నెఱిఁగి తెచ్చినట్ల జ
గన్నుతు నలు నెఱిఁగి తెమ్ము ♦ కౌశలమున వి
ద్వన్నాథ! సర్వగుణ సం
పన్నుండవు నీవ యెంచుఁ ♦ బరికింపంగన్. 160

టీ. నన్నుఁ; ఎఱిఁగి=గుర్తుపట్టి, తెచ్చినట్లు అ= తెచ్చినచందమున నే; జగన్నుతుఁ=లోకములచేఁ గొనియాడఁబడిన, నలుఁ, కౌశలంబునఁ=

నేర్పుతో, ఎఱిఁగి; తెమ్ము = తోడ్కొనిరమ్ము, విద్వాన్నాథ = పండితులలో శ్రేష్ఠుఁడా; ఎందుఁ = ఎచ్చటను; పరికింపఁగన్ = విచారింపఁగా, నీవు అ = నీవె; సర్వగుణసంపన్నుఁడవు = సమస్తసుగుణములతో నిండినవాఁడవు, (నీవు తప్ప వేఱొకరీపనిని జేయఁజాలరు.)

క. అరుగు మయోధ్యకు దేశాం
తరవిప్రుఁడవై రవిప్రతాపోన్నతు ను
త్తరకోసలేశు భాంగా
సరినిం గను మనఘు నమర సముఁ బుతుపర్ణున్. 16

టీ. దేశాంతరవిప్రుఁడవు ఐ = ఇక్కడనుండి వచ్చినవాఁడవనికాక (పొరుగూరిబ్రాహ్మణుఁడనను వ్యాజముతో); అయోధ్యకున్, అరుగుము, రవిప్రతాపఉన్నతున్ - రవి = సూర్యునియొక్క, ప్రతాప = వేఁడిమివంటి వేఁడిమిచేత; ఉన్నతున్ = మీరినవారిని, అనఘున్ = దోషములేనివానిని; అమరసమున్ = దేవతలతో సమానుని; ఉత్తరకోసలఈశున్ = ఉత్తరకోసలదేశము నకు ప్రభువగువానిని, భాంగాసరినిన్ = భంగాసరునికుమారుని, ఋతుపర్ణునిన్, కనుము = చూడుము.

వ. మఱియు విదర్భవిభుఁడగు భీముండు నలుఁ డరయుంబంచి యెందునుం గానక దమయంతికి ద్వితీయ స్వయంవరంబు రచియింపం బూనిన నందులకు భూవలయంబునంగల రాజు లెల్లను బోయెద రని యతిత్వరితంబుగా ఋతుపర్ణునకుం జెప్పుమనిపంచిన సుదేవుం డయోధ్యానగరంబునకుంబోయి ఋతుపర్ణుఁ గాంచి విదర్భాపురంబున దమయంతీ ద్వితీయ స్వయంవరం బెల్లియయ్యెడునని చెప్పిన విని ఋతుపర్ణుండు

బాహుకుం జూచినాకు దమయంతీ ద్వితీయ స్వయంవరము
చూడ నొక్కనాఁడ విదర్భకుం బోవలయు నీయశ్వనైపు
ణ్యంబుఁ బరికాశింపం జేయుమనిన నట్ల చేయుదునని
నలుండు తనమనంబున దుఃఖించి. 162

టీ. మఱియు, విదర్భావిభుఁడు అగు = విదర్భదేశపు రాజగు భీముఁడు; నలున్, రోయన్ = వెదకుటకు; పంచి = అనతిచ్చి, ఎందును, కానక, దమయంతికిన్; ద్వితీయస్వయంవరంబు = రెండవస్వయంవరము; రచియింపన్ = చేయుటకు; పూనినన్ = ప్రయత్నపడఁగా, అందులకున్ = ఆస్వయంవరమునకు, భూవలయంబునన్ = భూమండలమందు; కలరాజులు, ఎల్లను, పోయెదరు. అని; అతిత్వరితంబుగాన్ = మిక్కిలి తొందరపాటుతో, చెప్పుము, అని, పంచినన్ = చెప్పగా, సుదేవుఁడు, అయోధ్యాపురంబునకున్, పోయి, ఋతుపర్ణున్, కాంచి, విదర్భాపురంబునన్ = దమయంతీ ద్వితీయస్వయంవరంబు; ఎల్లి = రేపు, అయ్యెడున్ = జరుగును, అని; చెప్పినన్, విని; ఋతుపర్ణుఁడు, బాహుకున్, చూచి, నాకున్ = నేను; దమయంతీద్వితీయస్వయంవరంబు, చూడన్ = చూచుటకు, ఒక్కనాఁడు అ = ఒక్కదినములోపలనే, విదర్భకున్; పోవలయును, నీఅశ్వనైపుణ్యంబు = నీగుఱ్ఱములను నడుపుటయందలి నేర్పును; పరికాశింపఁజేయుము = తెలియఁజేయుము, అనన్, అట్లు అ = అలాగే; చేయుదును, అని, నలుఁడు; తనమనంబునన్; చితించి = యోచించి.

ఆ. అడవిఁ దన్నుఁబాసి ♦ యరిగిన నలిగి కా
కున్నె యిట్లు చేయ ♦ నువిద గడఁగె
నిట్లయేని కూర్తు ♦ రింతులు మాకని
విశ్వసించువారు ♦ వెడఁగు లెందు. 163

టీ. అడవిన్ = అడవియందు; తన్ను; పాసి = విడిపించి, అరిగినన్ = పోవఁగా, అలిగి కాదు కొన్నె = కోపము చేత నేకదా, ఉవిద = ఈదమయంతి, ఇట్లు చేయన్ = ఈపునఃకార్యము రెండవస్వయంవరము జేయుటకు; కడఁగెన్ = పూనెను, ఇట్లు అ ఏని = లోకమందెట్టివాడుక యుండును నేని. ఇంతులు = స్త్రీలం మానుల్, కూర్తురు = మగనిమీఁద నిష్టముగలిగియుందురు, అని; విశ్వసించువారు = నమ్మువారు, ఎందున్ = ఏవిషయమునను, వెడఁగులు = మూర్ఖులు.

ఆ. సాధ్వి నాకుఁ గూర్చు ♦ సంతతికలయది
చెలువ యిట్టు ♦ లేల చేయు నైన
నెఱుఁగవలయు దీని ♦ నీ ఋతుపర్ణుతోఁ
బోదునని నలుండు ♦ బుద్ధిఁ దలఁచి. 164

టీ. సాధ్వి = పతివ్రతయగు దమయంతి; నాకున్ = నాయందు, కూర్చును = ప్రేమగలిగియుండును, సంతతికలయది = బిడ్డలుగలది; చెలువ = దమయంతి, ఇట్టులు, ఏల; చేయును, ఐనన్, దీనిన్ = ఈవృత్తాంతమును, యెఱుఁగవలయును, నేనును; ఋతుపర్ణునితోన్ = ఋతుపర్ణమహారాజుతోఁగూడ, పోదును అని, నలుఁడు, బుద్ధిన్ = తలఁపునందు, తలఁచి = ఎంచి.

వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చిన తనరథంబునందు హయంబుల
నాలక్ష్యమాణ శుభలక్షణంబులు వాయువేగంబులు నైన
వానిం బూన్చికొని వచ్చిన ఋతుపర్ణుండారథంబెక్కినప్పుడు
హయంబులు మొగ్గిసం జూచి యిప్పేదగుఱ్ఱంబు లతి
దూరంబెట్లు పోవనోపు నొండుగుఱ్ఱంబులం బూన్పుమనిన
బాహుకుం డిట్లనియె. 165

టీ. తొల్లి=పూర్వము, వార్ష్ణేయుఁడు, తెచ్చిన తనరథంబునందుఁ, ఆలక్ష్యమాణశుభలక్షణంబులు - ఆలక్ష్యమాణ = చూడఁబడుచుండు, శుభ = మేలైన, లక్షణంబులు = చిహ్నములు గలవియు, వాయువేగంబులు = వాయువేగమువంటి వేగము గలవియు, ఐనవానిన్ = ఐనట్టి, హయంబులనున్ = గుఱ్ఱములను; పూన్చికొనివచ్చినన్ = కట్టుకొనిరాఁగా; "ఋతుపర్ణుఁడు" ఆరథంబు ఎక్కినప్పుడు, హయంబులు = గుఱ్ఱములు, మ్రొగ్గినన్ = మోఁకాళ్ళు నేలకు ఆనునట్లు ముందుకువంగఁగా, చూచి, ఇప్పేదగుఱ్ఱంబులు = ఈబక్కగుఱ్ఱములు, అతిదూరంబు = మిక్కిలిదవ్వు; ఎట్లు; పోవనోపున్ = పోఁజాలును, ఒండుగుఱ్ఱములన్ = వేఱుగుఱ్ఱములను; పూన్పుము = కట్టుము, అనినఁ = బాహుకుండు; ఇట్లనియె.

క. అవనీశ ! యీ హయంబులు
పవనగతిం బఱచుఁ బ్రొద్దు ♦ వడకుండఁగ నేఁ
డ విదర్భకు ననవుడు విని
కువలయపతి మెచ్చి బాహు ♦ కున కిట్లనియెన్. 166

టీ. అవని ఈశా = రాజా; ఈహయంబులు = ఈఅశ్వంబులు, పవనగతిఁ = వాయువేగమువంటి వేగముతో, ప్రొద్దు పడక ఉండఁ గన్ = సూర్యుఁడస్తమించులోపల; నేఁడుఅ = యీదినముననే; విదర్భకున్ = విదర్భాపురికి; పఱచుఁ = పరుగెత్తును, అనవుడుఁ = అనిచెప్పఁగా; విని, కువలయపతి = భూమండలపతియగు ఋతుపర్ణుఁడు, మెచ్చి, బాహుకునకుఁ, ఇట్లు, అనియెన్.

వ. అట్లయిన నీహయతత్త్వకౌశలం బెఱింగి నీకు నభిమతం బొనరింతునని రథంబెక్కి బాహుకవార్ష్ణేయసహితుండయి యరుగువాఁడు. 167

టీ. అట్లయిన = ఆలాగైనచో; నీహయతత్త్వకౌశలంబు = నీయశ్వ హృదయమందలి నేర్పును; ఎఱిఁగి = తెలిసికొని, నీకున్; అభిమతంబు = నీకోర్కె ను; ఒనరింతును = చేసెదను, అని, రథంబు, ఎక్కి, బాహుకవార్ష్ణేయ సమేతుఁడయి = బాహుకవార్ష్ణేయులతోఁ గూడినవాఁడయి, అరుగువాఁడు = పోవుచుండఁగా.

మధ్యాక్కర. ఎదురను దవ్వులఁజూచినపొడవు ♦ లెల్లఁదత్క్షణమ
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి ♦ కనఁబడఁబిఱుఁద
నివి దినేశ్వరురథమో యనూరుఁడో ♦ యితఁ డంచునపుడు
హృదయమునను గడువిస్మయం బందె ♦ నిక్ష్వాకుకులుఁడు.

టీ. ఎదురన్ = ఎదుట, దవ్వులన్ = దూరములందు; చూచిన పొడవులు ఎల్లన్ = చూచునట్టినిడివివస్తువులన్నియు. తత్క్షణము అ = వెంటనే; కదియఁగాన్ = సమీపింపఁగా; అవ్వి = అడవి; పిఱుఁదన్ = వెనుక; ఎంతయున్ = మిక్కిలి; దవ్వుఅయి = దూరమై; కనఁబడన్ = అగుపడఁగా; ఇది దినేశ్వరురథమో = సూర్యునితేరో; ఇతఁడు; అనూరుఁడో = సూర్యుని సారథియో; అంచున్ = అప్పుడు; ఇక్ష్వాకుకులుఁడు = ఇక్ష్వాకువంశస్థుఁడైన ఋతుపర్ణమహారాజు; హృదయమునన్ = మనసునందు; కడున్ = మిక్కిలి; విస్మయము = ఆశ్చర్యము, అందెను.

వ. వార్ష్ణేయుండును విస్మయంబునొంది తనమనంబున.   169

టీ. వార్ష్ణేయుండు, విస్మయంబు = ఆశ్చర్యంబు, అంది; తనమనంబునన్ = తన మనస్సునందు. (వై. ప, అ.)

క. ఈతండు శాలిహోత్రుండో
మాతలియో నలుఁడొ యొరులు ♦ మానవులు జవో
పేతముగ నిట్లు రథహయ
నీతి యెఱుంగుదురె ధారు ♦ ణీవలయమునన్. 170

టీ. ఈతఁడు, శాలిహోత్రుఁడో = శాలిహోత్రుఁడను ఋషియో; మాతలి ఓ= ఇంద్రునిసారథియో, నలుఁడు ఓ; ధారుణీమండలమునన్ = భూమండలమందు; ఒరులు మానవులు = ఇతరమనుష్యులు, జవఉపేతముగన్ = తొందరతోఁగూడునట్లుగా, ఇట్లు; రథహయనీతి = రథాశ్వములనడుపు శాస్త్రమును; ఎఱుంగుదురు ఏ= తెలిసికొందురా.

వ. వయోవిద్యావైభవంబుల నితఁడు నలుం బోలెడి, వికృతరూపధరుం డైన కారణం బేమియొ! మహాపురుషులు దైవనియుక్తులై ప్రచ్ఛన్నవృత్తి నుండుదురు. వారి నెఱుంగం బోలునె? యనుచుం జనుచున్న ఋతుపర్ణుండు దన యుత్తరీయంబు జాఱి భూతలంబునం బడిన మరలిచూచి బాహుకా! వార్ష్ణేయుండు పోయి యుత్తరీయంబు దెచ్చునంతకు రథగమనం బించుక మందంబు సేయు మనిన బాహుకుండు నగి నీయుత్తరీయంబు వడినయెడ యిచ్చోటికి నొక్క యోజనంబు గలదు. దాని వార్ష్ణేయుం డెట్లు దేనేర్చునని రథగమనవేగ మహాత్మ్యంబు సెప్పుచు ననేకదేశంబులు గడచిచన నొక్కయెడ నగణ్యపర్ణఫలశాఖాలంకృతం బైన విభీతకవృక్షంబుఁ గని ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె.

టీ. వయోవిద్యావైభవంబులన్ = వయస్సు; చదువు; సామర్థ్యము అనువానియందు, ఇతండు = బాహుకుండు, నలున్ పోలెడిన్ = నలుఁడనితోఁ చెడి; వికృతరూపధరుఁడు ఐనకారణంబు = మాఱురూపంబు దాల్చినవాఁడై నందులకు కారణము; ఏమియొ = ఏమిటో; మహాపురుషులు = గొప్పవారును దేవనియుక్తులై = వేల్పులచేఁబురికొల్పఁబడినవారయి; ప్రచ్ఛన్నవృత్తిన్ = రహస్యమైన నడవడితో, ఉండుదురు, వారిన్ = అట్టివారిని; ఎఱుంగన్ = తెలిసికొనుట; పోలునే = వీలగునే, అనుచున్; చనునప్పుడు = పోవునప్పుడు; ఋతుపర్ణుఁడు, తన ఉత్తరీయంబుజాఱి = తనయంగవస్త్రముజాఱి; భూతలంబునన్ = నేలమీఁద, పడినన్ = పడఁగా, మఱలిచూచి = తిరిగిచూచి, బాహుకా, వార్ష్ణేయుండు, పోయి = రథంబుదిగిపోయి; ఉత్తరీయంబు = అంగవస్త్రమును, తెచ్చునంతేసున్ = తెచ్చుపలుకును; రథగమనంబు = తేరిపోక, ఇంచుక = కొంచెము, మందంబుసేయుము; అనినన్ = తగ్గింపుమనఁగా, బాహుకుండు, నగి = నవ్వి, నీఉత్తరీయంబు = నీయంగవస్త్రము, బడినయెడ = పడినచోటు, ఇచ్చోటికిన్ = ఇక్కడికి, ఒక్కయోజనంబు, కలదు, వార్ష్ణేయుండు, యెట్లు, తేనేర్చును = తేఁగలఁడు, అని, రథగమనవేగమహాత్మ్యంబు-రథ = తేరియొక్క; గమన = నడకయందలి, వేగ = వడియొక్క, మాహాత్మ్యయంబు = నేర్పు, చెప్పుచున్; అనేకదేశంబులు, కడచినన్ = దాటివెళ్ళఁగా, ఒక్కయెడన్ = ఒక్కచోట, అగణ్య...తంబు-అగణ్య = లెక్కపెట్టనలవికాని, పర్ణ = ఆకులతోను, శాఖా = కొమ్మలతోను, అలంకృతంబు = సింగారింపఁబడియుండునది; ఐన, విభీతకవృక్షంబున్ = తాండ్రచెట్టును, కని, ఋతుపర్ణుండు, బాహుకునకున్, ఇట్లు, అనియె.

ఆ. ఎల్లవారు నెఱుఁగ ♦ నెల్ల వానిని భిన్న
విషయు లెల్ల వారు ♦ విద్యలందుఁ
దొలఁగ కేనెఱుంగు ♦ దును దృష్టిమాత్రన
సకలమైన వస్తు ♦ చయముసంఖ్య. 172

టీ. ఎల్లవారును=అందఱును, ఎల్లవానిని = అన్నివిద్యలను, ఎఱుఁగరు=తెలియరు, విద్యలందుఁ = చదువులలో, ఎల్లవారును, భిన్నవిషయులు=వేఱుపడినవిషయములుగలవారు, వేఱువిషయముల నెఱిఁగినవారనుట, ఏను, దృష్టిమాత్రన=చూచినతోడనె, సకలవస్తుచయముసంఖ్య-సకలవస్తు = అన్నివస్తువులయొక్క, చయము=గుంపుయొక్క, సంఖ్య=లెక్క, తొలఁగక=తప్పకుండ, ఎఱుఁగుదును = తెలిసికొందును.

వ. ఇవ్విభీతకంబున ఫలపర్ణ సముదాయ సంఖ్యఁ జెప్పెదవిను మీరెండుశాఖలంగల పల్లవఫలంబులు పదివేలునొక్కండు తక్కిన శాఖలంగలయవి రెండు వేలు దొంబదేనసిన బాహుకుండు విని వీని నెన్నికొని నిశ్చయింపనేరనని రథంబు నిలిపి యావృక్షం బాక్షణంబ యురులంద్రోచి యయ్యై శాఖలయాకులుం బండులు నెన్నిన ఋతుపర్ణుఁడు సెప్పిన యన్నియయైన నచ్చెరువడి యివ్విద్య నాకుపదేశింపవల యునని యడిగిన ఋతుపర్ణుండిట్లనియె. 173

టీ. ఇవ్విభీతకంబునఁ = ఈతాండ్రచెట్టునందు, ఫలపర్ణసముదాయసంఖ్యను=పండ్లయు ఆకులయు గుంపులయొక్క మొత్తమును, చెప్పెదను, వినుము, ఈరెండుశాఖలఁ = ఈరెండుకొమ్మలయందు, కల, పర్ణఫలంబులు = ఆకులు,పండ్లు, పదివేలును ఒక్కండు = 10001, తక్కినశాఖలఁ, కలయవి = ఉండునవి, రెండువేలునుందొంబదియేను = 2095, అనినఁ, బాహుకుఁడు, విని, వీనిని, ఎన్నికొని = లెక్కపెట్టికొని, నిశ్చయింపఁ నేరను = నిర్ణయింపఁజాలను, అని, రథంబుఁ, నిల్పి, అవృక్షంబు = ఆచెట్టు ను, ఆక్షణంబు అ = ఆవెంటనే, ఉరులఁ ద్రోచి = పడద్రోసి, అయ్యై

శాఖలయాకులన్ = ఆయాకొమ్మలయందలియాకులను; పండులును=పండ్లను, ఎన్నినన్ =లెక్కపెట్టఁగా, ఋతుపర్ణుఁడు; చెప్పినయన్నియ= చెప్పినన్నియే; ఐనన్ = ఉండఁగా, అచ్చెరుపడి = ఆశ్చర్యమునొంది: ఇవ్విద్య; నాకున్; ఉపదేశింపవలయును; అని; అడిగినన్; ఋతుపర్ణుఁడు; ఇట్లనియె.

క. ఇది యక్షహృదయ మనఁగా
విదితంబగువిద్య దీని ♦ విధ్యుక్తముగా
మది నెఱుఁగు నరుఁడు సంఖ్యా
విదుఁడగు దుష్కృతికళంక ♦ విషముక్తుఁడగున్. 174

టీ. ఇది; అక్షహృదయంబు; అనఁగాన్; విదితంబు = పేర్కొనఁబడినది, అగువిద్య; దీనిన్ = ఈవిద్యను; విధియుక్తంబుగా = శాస్త్రమందుఁజెప్పఁబడినవిధముగా; మదిన్ = మనసున-బుద్ధియందు; ఎఱుఁగునరుఁడు=తెలిసికొన్నవాఁడు; సంఖ్యలను జెప్పఁగలవాఁడు అగును, దుష్కృతికళంకవిషముక్తుఁడు = పాపములవలనను, నిందలవలనను; విషమువలనను విడువంబడినవాఁడు; అగును.

చ. సకలగుణప్రసిద్ధుఁడగు ♦ సర్వహితుండగుఁజూ వెయుంను బాహుకునకుఁ బ్రీతితోడ విధి♦యుక్తముగా నుపదేశమిచ్చెన
త్యకుటిలబుద్ధి నక్షహృద ♦ యంబుకరంబు రయంబుతోఁ విద
ర్భకుఁజను వేడ్కఁజేసిఋతుపర్ణుఁడు పూర్ణమనఃప్రసన్నుఁడై.

టీ. ఋతుపర్ణుండు; కరంబు=మిక్కిలి; రయంబుతోన్ = వడితో; విదర్భకున్, చను వేడ్కన్ చేసి = పోవునుత్సాహమువలన; పూర్ణమనఃప్రసన్నుఁడుఐ=నిండుమనస్సుచేత ననుగ్రహించినవాఁడై; సకలగుణప్రసిద్ధుఁడు =

(నలుఁడు) అన్నిసుగుణములచేఁ బ్రఖ్యాతి చెందినవాఁడు; అగును, సర్వహితుండు=అందరికిమేలు చేయువాఁడును; అగును. చూవె = సుమీ; అంచున్ = అనిచెప్పుచు; అతిఅకుటిలబుద్ధిన్=మిక్కిలిచక్కనైన తలంపుతో; బాహుకునకున్; ప్రీతితోడన్; విధియుక్తముగాన్ = శాస్త్రవిధితోఁగూడి; అక్షహృదయంబు=అక్షహృదయమనెడి విద్యను; ఉపదేశము ఇచ్చెను = ఉపదేశించెను.

వ. ఇట్లు నలుండు ఋతుపర్ణుచేత నక్షహృదయంబుఁబడసి సంతుష్టుండయి నీకు నశ్వహృదయంబిచ్చెదఁ బరిగ్రహింపుమనిన ఋతుపర్ణుండట్లచేసెదనంతకు నీయందయుండ నిమ్మది నావలచినప్పుడ చేకొనియెదననియె, నంత నయ్యక్షహృదయ సామర్థ్యంబున నప్పుడ. 176

టీ. ఇట్లు; నలుఁడు: ఋతుపర్ణుచేతన్; అక్షహృదయంబున్; పడసి, సంతుష్టుండు ఐ; నీకున్; అశ్వహృదయంబు = అశ్వహృదయమనెడివిద్యను; ఇచ్చెదను. పరిగ్రహింపుము. అనినన్; ఋతుపర్ణుండు; అట్లు అ=అట్లే; చేసెదను అంతకున్!= నేనుతీసుకొనునంతవఱకు; నీయందున్ అ=నీయందే; ఉండనిమ్ము, అది=దానిని; నావలచినప్పుడుఅ= నాకుఁగావలసినప్పుడే; చేకొనియెదను=తీసికొందును. అనియె, అంతన్=తర్వాత; ఆఅక్షహృదయసామర్థ్యంబునన్ = అక్షహృదయమందలి యానేర్పుచేత; అప్పుడుఅ=అప్పుడే.

క. నలుఁ దొల్లి యాక్రమించిన
కలి కర్కోటకవిషంబు ♦ గ్రక్కుచు నొడలన్
వెలువడి నలునకు విహితాం
జలియై తన్నెఱుఁగఁజెప్పెఁ ♦ జంచలుఁడగుచున్. 177

టీ. నలుఁడు; తొల్లి=పూర్వము; ఆక్రమించిన కలి=చుట్టుకొనియున్న కలిపురుషుఁడు; కర్కోటకవిషంబుఁ = కర్కోటకుని యొక్క విషమును; గ్రక్కుచుఁ; విహితఅంజలియై = చేతులు జోడించుకొన్నవాఁడై; చంచలుఁడగుచుఁ (భీతిచే) కదలుచు, తన్నుఁ, ఎఱుఁగఁ జెప్పెఁ = తాను పలానివాఁడని యెఱిఁగించెను

ఆ. వానిఁ జూచి నలుఁడు ♦ తానల్గి శాపమీఁ
నున్నఁ గలి యెఱింగి ♦ నిన్నుఁ బొంది
యహివిషంబుచేత ♦ ననయంబు దగ్ధుండ
నైతి నింక నాకు ♦ ననఘ! సైఁపు. 178

టీ. వానిఁ=ఆకలిపురుషుని, చూచి, నలుఁడు, తాను అల్గి = కోపపడి, శాపము ఈఁ ఉన్నఁ=శపింపబోవుచుండఁగా, కలి ఎఱింగి = (ఆసంగతి) తెలిసికొని, నిన్నుఁ పొంది = నీలోఁ బ్రవేశించి, అహివిషంబుచేతఁ = సర్పము యొక్క విషముచేత, అనయంబు=ఎల్లప్పుడును, దగ్ధుండను ఐతిని=మాడితిని, అనఘ=పాపములేనివాఁడా; ఇంకఁ, నాకుఁ = సైఁపు=నన్ను క్షమింపుము.

వ. నిన్నుఁ గీర్తించిన జనులు నావలని భయంబుఁ బొందరు. నాకుం గరుణింపుమనిన నలుండు కోపంబుడిగెఁ గలియు నవ్విభీతకవృక్షంబు నాశ్రయించె, నది మొదలుగా నవ్విభీతకంబు ప్రశస్తంబయ్యె నట్లు నలుండు వికృతరూపమాత్రంబు దక్కఁ దక్కిన దుష్కృతంబులవలన విముక్తుండయి రథం బెక్కి యతివేగంబున ఋతుపర్ణ వార్ష్ణేయ సహితుండై కుండినపురంబునకుం జని యొక నాఁటి సాయాహ్నంబున. 179

టీ. నిన్నున్, కీర్తించినజనులు= పొగడినజనులు. నావలనిభయంబు= నాభీతిని, పొందరు= చెందరు, నాకున్= నాయెడ, కరుణింపుము = దయసేయుము, అనినన్ నలుఁడు; కోపంబుడిగెన్ = కోపంబువిడిచెను. కలియు = కలిపురుషుఁడు, అవ్విభీతకంబున్= తాండ్రచెట్టును, ఆశ్రయించెన్ = పొందెను, అది మొదలుగా = అది మొదలుకొని, అవ్విభీతకంబు = ఆ తాండ్రచెట్టు, అప్రశస్తంబుఅయ్యెన్ = అప్రసిద్ధమయ్యెను, అట్లు, నలుఁడు, వికృతరూపమాత్రంబుతక్క = మాఱురూపం బొక్కటితప్ప, తక్కిన దుష్కృతంబువలనన్=తక్కినపాపంబువలన, విముక్తుఁడు ఐ=విడువఁబడినవాఁడై; రథంబు ఎక్కి; అతివేగంబునన్=మిగులవడితో, ఋతుపర్ణ వార్ష్ణేయసమేతుఁడు ఐ= ఋతుపర్ణునితోను వార్ష్ణేయునితోను గూడినవాఁడై; విదర్భకున్, చనియెన్, అంతన్=తర్వాత, సాయాహ్నమునన్=సాయంకాలమునందు.

క. మానుగ ఋతుపర్ణుఁడు భీ
మానుజ్ఞాతుఁడయి చొచ్చె ♦ నాప్రోలు రథ
ధ్వానంబు మ్రోయుచుండఁగ
నానాదిఙ్ముఖములను ఘ ♦ నధ్వనిపోలెన్. 180

టీ. ఋతుపర్ణుఁడు, రథధ్వానంబు=తేరిమ్రోఁత, ఘనధ్వనిపోలెన్ = ఉఱుమువలె, నానాదిఙ్ముఖములన్ = అన్నిదిక్కులయందు, మ్రోయుచుండన్=ధ్వనించుచుండఁగా, ఋతుపర్ణుఁడు, మానుగన్ = గౌరవముతో భీమ అనుజ్ఞాతుండు ఐ = భీమరాజుచే నుత్తరువుపొందినవాఁడై, ఆప్రోలు=ఆ విదర్భాపురంబును, చొచ్చెను = ప్రవేశించెను.

సీ. దమయంతి యారథ ♦ ధ్వనివిని యిది నళు
రథఘోషమని యను ♦ రాగమొంది

నలు నిషధేశుఁ బు ♦ ణ్యశ్లోకు లోకోప
కారకుఁ జూడంగఁ ♦ గంటి ననుచు
ఘనభుజుఁ జూడంగఁ ♦ గాననినాఁడుఁ ద
ద్భుజపరిరంభణ ♦ మునను సుఖముఁ
బడయనినాఁడును ♦ బ్రాణంబు విడుతునే
నని తలంచుచుఁ గమ ♦ లాయతాక్షి
ఆ. యారథాధినాథుఁ ♦ డై వచ్చు ఋతుపర్ణుఁ
జూచి యప్పుడధిక ♦ శోకతప్త
యగుచునుండె నంత ♦ నా ఋతుపర్ణుండు
భీముఁ గానవచ్చెఁ ♦ బ్రియముతోడ. 181

**టీ.** దమయంతి, ఆరథధ్వని=తేరిచప్పుడు, విని, నలురథఘోషము=నలుని తేరుసద్దు, అని, అనురాగము=సంతోషము, ఒంది=పొంది, పుణ్యశ్లోకున్=పుణ్యమునొనర్చు కీర్తిగలవానిని, లోకోపకారకున్=జనులకు హితముఁజేయు వానిని, నిషధఈశున్=నిషధదేశపు రాజగువానిని. నలున్, చూడన్ కన్ కంటిని=చూడఁగలిగితిని, అనుచున్=చెప్పుచు, ఘనభుజున్=నిడుపుచేతులుంగల వానిని, చూడన్ కన్ కాననినాఁడున్=చూడ నోచుకోనిదినమునను, తత్ భుజపరిరంభణమునన్—తత్=ఆనలుని యొక్క, భుజ=బాహువులయొక్క, పరిరంభణమునను=ఆలింగనముచేతను, సుఖము=సౌఖ్యము, పడయనినాడున్=పొందనియెడల, నేను, ప్రాణంబు విడుతును; అని, తలఁచుచున్, కమలఆయతఅక్షి=తామరపువ్వుల రేకులవలె నిడుపైన కన్నులుగల ఆ దమయంతి, ఆరథఅధిరూఢుఁడు=ఆరథము నెక్కినవాఁడై. వచ్చు, ఋతుపర్ణున్, చూచి, అప్పుడు, అధికశోకతప్తఅగుచున్ వుండె = ఎక్కువ దుఃఖమనెడి సెగచే మాడినదై యుండెను, అంతన్ = తర్వాత, ఆఋతుపర్ణుడు, ప్రియముతోడన్ = ప్రేమతో, భీమున్=భీమరాజును, కానన్ వచ్చెను=జూడవచ్చెను.

వ. భీముండును వానింబూజించి యొక్క రమ్యహర్మ్యంబున విడియించిన ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరంబను శబ్దంబు వినంగానక యాత్మగతంబున. 182

టీ. భీముఁడును; వానిన్=ఆ ఋతుపర్ణుని, పూజించి=గౌరవముచేసి, ఒక్కరమ్యహర్మ్యంబునన్=ఒకయందమయిన మేడయందు, విడియించినన్ = =విడిచిచూడఁగా, ఋతుపర్ణుండు, ఆపురంబునన్=ఆపట్టణమందు, స్వయంవరంబు అనుశబ్దము = స్వయంవరంబనెడి సందడి, వినన్ కానక = వినక, ఆత్మగతంబునన్ = తన మనస్సునందు.

క. ధరణిం గల రాజులిం దె
వ్వారు వచ్చినవారు లేరు ♦ వైదర్భి యొరుకా
వరియింప నంతధర్మే
తరచరితయె యనుచునుండెఁ ♦ దద్దయులజ్జ. 183

టీ. ధరణిన్=భూమియందు; కలరాజులు; ఇందున్, ఎవ్వరు; వచ్చినవారు; లేరు=కనంబడలేదు. వైదర్భి = దమయంతి, ఒరున్=ఇతరుని; వరియింపన్=కోరుటకు-పెండ్లాడుటకు, అంత=మిక్కిలి; ధర్మేతరచరితయె- ధర్మ=నీతిదప్పనిదానికంటె; ఇతర = వేఱగుఅన్యాయమయిన; చరితయె =నడవడిగలదా; అనుచున్=ఎంచుచు; తద్దయున్=మిక్కిలి; లజ్జన్ = సిగ్గుతో, వుండెను.

వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించి యుండునంత దమయంతి బాహుక వార్ష్ణేయులతోడ వచ్చిన ఋతుపర్ణుంజూచి విఫలమనోరథ

యై యుండనోపక కేశినియనుదానిం బిలిచి ఋతుపర్ణు
నయోధ్యాపతింగా వార్ష్ణేయు సూత పుత్త్రుంగా నెఱింగితి
బాహుకుండనువాఁ డెవ్వండో వానియందు నాహృదయంబు
కరంబు ముదితంబగుచున్నయది. మనపర్ణాదునకుఁ బ్రతి
వచనం బిచ్చినవాఁడు వాఁడ కావలయు. వానికడకుం బోయి
యెఱింగి రమ్మని పంచిన నది వోయి బాహుకుం గని దమ
యంతి నీకుశలంబడుగఁ బుత్తెంచె నిందుల కేమికారణం
బున వచ్చితిరనిన దానికి బాహుకుండిట్లనియె. 184

టీ. బాహుకుండును; రథశాలన్ = తేరిగుఱ్ఱములఁగట్టు సావడియందు; రథఅశ్వంబులన్ = తేరిగుఱ్ఱములను; బంధించి = కట్టి; రథసమీపంబునన్ = తేరి చేరువను, విశ్రమించి = బడలిక దీర్చుకొని ; ఉండుసంతన్ = ఉండఁగా; దమయంతి; బాహుకవార్ష్ణేయులతోడన్; వచ్చినఋతుపర్ణున్; చూచి; విఫలమనోరథ ఐ = వ్యర్థమైన కోరికగలది = ఆశనిరాశచేసికొన్నదియై; ఉండన్ ఓపక = ఉండఁజాలక; కేశినిఅను పేరుగల చెలికత్తెను; పిలిచి; ఋతుపర్ణున్, అయోధ్యాపతిన్ కాన్ = అయోధ్యకు రాజుగాను; వార్ష్ణేయున్ = సూతపుత్త్రునిన్ కాన్ = సారథినిగా; ఎఱిఁగితిని, బాహుకుండు; అనువాఁడు ఎవ్వఁడు-ఓ; వానియందున్; నాహృదయంబు = నామనస్సు; కరంబు = మిక్కిలి, ముదితంబు = అనురాగంబుగలది; అగుచున్నయది, మనపర్ణాదునకున్; ప్రతివచనంబు = బదులుమాట; ఇచ్చినవాఁడు, వాఁడు ఆ = అతఁడే; కావలయును; = వుండవలయును; వానికడకున్; పోయి; ఎఱింగి = సంగతి తెలిసికొని, రమ్ము, అని పంచినన్ = చెప్పఁగా; అది; పోయి; బాహుకున్; కని, దమయంతి; నీకుశలంబు = నీక్షేమము; అడుగన్ = విచారించుటకు; పుత్తెంచెను = పంపెను, ఇందులకు = ఇచ్చటికి; ఏమికారణమునన్, వచ్చితి; అనినన్; దానికిన్ = ఆకేశినికి; బాహుకుండు; ఇట్లు; అనియెను.

క. ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయఁగడఁగి ♦ సకలక్షత్త్రా
న్వయవీరుల రావించిన
నయనిధి ఋతుపర్ణుఁ డొక్క ♦ నాఁటన వేక్కన్. 185

క. వినవె శతయోజనంబులు
చనుదెంచె నయోధ్యనుండి సరి నిందుల కా
తని సారథినై యిట యే
నును వచ్చితి వానితో మ ♦ నోవేగమునన్. 186

టీ. వినుము ఎ=అలకింపుమీ, దమయంతి; ప్రియమునన్ = ప్రేమతో; పునఃస్వయంవరము = తిరిగిస్వయంవరంబును; చేయన్ కడంగి = చేయ ప్రయత్నించి; సకలక్షత్త్రియ అన్వయవీరులన్ = అన్నిరాజవంశపుశూరులను; రావించినన్ = పిలిపింపఁగా; నయవిధి = నీతిశాస్త్రమునకు స్థానభూతంబయిన, ఋతుపర్ణుఁడు; ఒక్కనాఁటన్ ఆ = ఒక దినముననే; అయోధ్యనుండి అయోధ్యాపురంబునుండి; ఇందులకున్ సరి = ఇక్కడికి సరిగా; శతయోజనంబులు = నూఱామడల దూరము; చనుదెంచెను = వచ్చెను, నేను; ఆతనిసారథినై; ఇటన్ = ఇచ్చటికి; వానితోన్ = ఆఋతుపర్ణునితోఁ గూడ మనోవేగమునన్ = మనస్సునకుఁగల వేగముఁబోలు వేగముతోఁ వచ్చితిని.

వ. నావుఁడు మూఁడవవాఁ డెవ్వఁడని యడిగిన నక్కేశినికి బాహుకుం డిట్లనియె. 187

టీ. నావుఁడున్ = అని చెప్పఁగా; మూఁడవవాఁడు; ఎవ్వఁడు; అని; అడిగినన్; ఆకేశినికిన్; బాహుకుఁడు; ఇట్లు; అనియె.

క. నలురథచోదకుఁ డతఁ డ
త్యలఘుఁడు వార్ష్ణేయనాముఁ ♦ డనవుఁడు వాఁడ
న్నలభూపాలకుపోయిన
వలనిదియని యెఱుఁగునొయన ♦ వాఁడిట్లనియెన్. 188

టీ. అతఁడు, నలరథచోదకుఁడు = నలునిరథంబు దోలువాఁడును; అతిఅలఘుడు = మిక్కిలి నైపుణ్యముగలవాఁడును; వార్ష్ణేయనాముఁడు = వార్ష్ణేయుఁడను పేరుగలవాఁడు; అనవుడున్ = (అని నలుఁడు) చెప్పఁగా; వాఁడు = ఆవార్ష్ణేయుఁడు; ఆనలభూపాలకు పోయిన వలను = ఆనలమహారాజుపోయిన ప్రదేశము; ఇది అని = ఫలానిదియని; ఎఱుఁగును ఒకో = తెలియునా; అనన్ = (అనికేశిని) అడుగఁగా; వాడు = ఆబాహుకుఁడు; ఇట్లనియెన్.

వ. వార్ష్ణేయుండును నలుపుత్త్రుల విదర్భేశ్వరునొద్దం బెట్టిపోయి నలురాజ్యభ్రంశంబువిని ఋతుపర్ణుఁ గొలిచియుండె నా తఁడును నలు నెఱుంగఁడు. 189

టీ. వార్ష్ణేయుండును, నలుపుత్త్రులన్ = నలమహారాజుబిడ్డలను, విదర్భేశ్వరునొద్దన్ = విదర్భరాజుదగ్గర; పెట్టిపోయి; నలురాజ్యభ్రంశంబు = నలుఁడు రాజ్యము పోగొట్టుకున్న వార్తను; విని ఋతుపర్ణున్; కొలిచి వుండెన్ = సేవచేయుచుండెను, ఆవార్ష్ణేయుఁడును; నలుణ్ణా; ఎఱుంగఁడు.

క. నలుతో నొక్కట నరిగిన
నలినాయతనేత్రి భీమ ♦ నందన యొండేఁ

నలుఁడొండెఁగాక యెఱుఁగఁగ
నలు నొరులకు నెఱుఁగఁ గార ♦ ణముగలదె మహిన్. 190

టీ. నలునితోన్; ఒక్కటన్ = కూడ, అరిగిన, నలినాయతనేత్ర = తెల్లని కమలలోచనయగు, భీమనందనయొండెన్ = దమయంతిగాని; నలుఁడు ఒండెన్ = నలుఁడుగాని; ఎఱుఁగున్ = తెలిసియుండును, ఒరులకున్ = ఇతరులకు; నలున్, ఎఱుఁగన్ = తెలిసికొనుటకు; మహిన్ = భూమియందు, కారణము = నిమిత్తము, కలదే = వున్నదా ? (లేదనుట.)

వ. అనిన విని కేశిని యిట్లనియె. 191

టీ. అనినన్; విని, కేశిని; ఇట్లనియె.

సీ. అడవిలో వస్త్రార్థ ♦ హారియై దయలేక
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ ♦ బాసి చనిన
నాఁటివస్త్రార్థంబు ♦ నలినాక్షి యిప్పుడుఁ
బరిధానముగఁ బొంసు ♦ పటలమలిన
మగుచున్న తనువుతో ♦ నయంబు జడగొన్న
యలకావలులతోడ ♦ నవనితలము
శయనంబుగా ధర్మ ♦ చారిణి దమయంతి
యనఘవ్రతంబుల ♦ నాచరించు
ఆ. చున్నదనిన నవిర ♦ ళోద్గతబాష్పపూ
ర్ణంబులైనలోచ ♦ నంబు లెఱుక
పడకయుండ వదన ♦ పద్మంబు వాంచి తా
నొండువలను చూచు ♦ చుండె నలుఁడు. 192

టీ. అడవిలోన్; వస్త్రఅర్ధహారిణి = కోకలోని సగము చించు కొన్నవాఁడై; దయ = కనికరము; లేక; ప్రాణఈశ్వరుఁడు = ప్రాణనాథుఁడు - భర్త; తన్నున్, పాసి = విడిచి; చనినన్ = వెళ్ళఁగా; నాఁటిఅర్ధవస్త్రంబు = ఆదినమునఁ గట్టిన సగము కోకయే, పరిధానముగన్ = కట్టుబట్టయై, యుండఁగా, పాంసుపటలమలినము = దుమ్ముయొక్క గాసిచే నల్లనిది; అగుచున్న; తనువుతోన్ = దేహముతోను; అనయంబు = ఎల్లప్పుడు; జడగొన్న = జడయైన. అలకఆవళులతోడన్ = ముంగురుల సమూహముతోను; (కూడి) అవనితలము = పుడమి, శయనంబు గాన్ = పాన్పుగాఁగా; దమయంతి, ధర్మచారిణి = పతివ్రతాధర్మంబునడుచునదియై, అనఘవ్రతంబులన్ = పాపంబుఁ బోఁగొట్టువ్రతములను, ఆచరించుచున్నది = చేయుచున్నది, అనిన = అని చెప్పఁగా, నలుఁడు, అవిరళ... ర్ణంబు-అవిరళ = దట్టముగా, వుద్గత = బయలు దేరుచున్న, బాష్ప = కన్నీటితో, పూర్ణంబులు = నిండినవి, అయిన, లోచనములు = నేత్రములు, ఎఱుకపడకయుండన్ = దృష్టి తెలియక యుండఁగా; వదనపద్మంబు = కమలమువంటి ముఖమును; వాంచి, తాను, ఒండువలను = మఱియొకవైపు, చూచుచుండెను.

వ. కేశినియును బాహుకుపలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన నది యాతని నలుంగా శంకించి యింకను వానికడ కేఁగుము. వాఁడుబుత్తుపర్ణువంటలవాఁడఁట. పచన సమయంబున వానిచరితం బిమ్ముగా నెఱింగిరమ్మని పంచిన నప్పుడచని కేశిని బాహుకునందున్న దైవమానుషనిమిత్తాం ద్భుతక్రియలు సూచివచ్చి దమయంతి కిట్లనియె. 193

టీ. కేశినియు, బాహుకుపలుకులు = బాహుకునిమాటలు, ఆకారంబును = స్వరూపమును; దమయంతికిన్. ఎఱింగించినన్ = తెలుపఁగా, అది = దమ

యంతి; అతనిఁ, నలుఁ గాఁ=నలునిఁగా, శంకించి = సందేహపడి, ఇంకను=తిరిగి, వానికడకుఁ; ఏఁగుము = వెళ్ళుము; వాఁడుఋతుపర్ణువంటలవాఁడుఅఁట, పచన సమయంబున = వంటచేయు సమయమున; వానిచరిత్రంబు = వానిసంగతి; ఎఱింగిరమ్ము = తెలిసికొనిరమ్ము; అని; పంచినఁ = పంపఁగా, అప్పుడే, చని; కేసిని, బాహుకునందున్, వున్న; దైవ...క్రియలు_దైవదేవసంబంధములైన, మానుష=మనుష్యసంబంధములైన; నిమిత్త=కారణములుగల; అద్భుతక్రియలు =ఆశ్చర్యకరంబులైనపనులు; చూచి, వచ్చి, దమయంతికిఁ; ఇట్లు; అనియెఁ.

క. అతనిచరితంబు సెప్పఁగ
నతిమానుష మపగతప్ర ♦ యాస మదృష్ట
శ్రుతపూర్వము పరమార్థమ
యతనిని దైవమనవలయు ♦ నంబుజనేత్రా! 194

టీ. అతనిచరితంబు=ఆతనిప్రవర్తనము, చెప్పఁగఁ=చెప్పుటకు, అతిమానుషము=ఆశ్చర్యమైనది, అపగతప్రయాసము=కష్టములేనిది, అదృష్టశ్రుతపూర్వము=ఇంతకుముందు చూడను వినను బడనిది, పరమార్థముఅ=నిజముగానే, అంబుజనేత్ర=కమలాక్షి, అతనిని, దైవము అనవలయుఁ = దైవమని చెప్పవలయును.

సీ. వినవమ్మ తృణముష్టిఁ ♦ గొని వాఁడు వీచిన
నందగ్ని యుదయించి ♦ యందు వంట
లమరునంతకు నింధ ♦ నములపేక్షింపక
యుడుగక మండుచు ♦ నుండు మఱియుఁ
గడఁకతోఁ నంజుళ్లు ♦ గడుగంగ సమకట్టి
జల మపేక్షించుడు ♦ సంభవిల్లి

కుంభముల్ నిండి ది ♦ వ్యాంభః ప్రవాహ మ
క్షయ మగుచుండు నా ♦ క్షణమ చూడ

ఆ. నతనికరతలద్వ ♦ యావమర్దితములై
కందియును మహా సు ♦ గంధకుసుమ
తతులు తొంటియట్ల ♦ తమకంపు విడువక
యుండు నతని తేజ ♦ మున్నతంబు. 195

టీ. వినుమమ్మ=వినుముఅమ్మ, వాఁడు=ఆబాహుకుఁడు, తృణముష్టిన్=గడ్డిపిడికిటిని=పిడికెడుగడ్డిని, వీచినన్=విసరినట్లైన, అందున్ = ఆగడ్డియందు, అగ్ని=నిప్పు, ఉదయించి=పుట్టి, అందున్ = ఆనిప్పునందు, వంటలు, అమరుచుండన్=జరుగుచుండఁగను, ఇంధనము=కట్టెలు, అపేక్షింపక, వుడుగక = విడువక, మండుచున్ వుండును, మఱియున్=ఇదియునుగాక, కడఁకతోన్=సంతోషముతో, నంజుళ్ళు=మాంసములు, కడుగఁగన్=కడుగుటను, సమకట్టి=పూని; జలము=నీరు, అపేక్షించుడున్=కోరఁగా, చూడన్=విచారింపగా, ఆక్షణముఅ=అదేక్షణమున, దివ్యఅంభఃప్రవాహము=తియ్యనినీటివెల్లువ, సంభవించి=పొడమి, కుంభముల్ = కడవలనిండుగా; నిండె, క్షయము అగుచుండున్ = తఱుగకయుండును, అతని...మర్దితముఐ—అతని=ఆనలునియొక్క, కరద్వయ=రెండుచేతులచేత, అవమర్దితములుఐ=నలపఁబడినవియై, కందియును = వాడియును, మహా...తతులు=మహత్=మిక్కిలి, సుగంధ=కమ్మనివాసనగల, కుసుమ=పువ్వులయొక్క; తతులు=గుంపులు, తొంటియట్ల=పూర్వమువలెనే, తమకంపు=తమవాసనను, విడుఃవకవుండును, అతనితేజము = అనలునికాంతి, వున్నతము=హెచ్చినదిగా, వున్నది.

న. అనిన విని దమయంతి వెండియుఁ గేశినింబిలిచి బాహుకు
వండిననంజుళ్ళు దెప్పించి యాస్వాదించి బాహుకునందునలు

లక్షణంబులు గలుగు టెఱింగియు నూఱడ నోపక వాని
పాలికిఁ గొడుకునుం గూఁతునుం గేశినితోడఁ బంచిన
నక్కుమారునిఁ గూఁతునుంజూచి. 196

టీ. అనినన్, విని, దమయంతి, వెండియున్ = తిరిగి, కేశినిన్, పిలిచి, బాహుకువండిననంజుళ్ళు = బాహుకుండువండినభక్ష్యవస్తువులను. తెప్పించి, ఆస్వాదించి=రుచిచూచి, బాహుకునందున్, నలులక్షణంబులు=నలునిగుఱుతులు, కలుగుట=వుండుట, ఎఱింగియున్=తెలిసియు, ఊఱడన్ఓపక = సమాధానము నొందఁజాలక, వానిపాలికిన్=ఆబాహుకునియొద్దకు, కొడుకునున్, కూఁతునున్=కుమార్తెను, కేశినితోడన్ = కేశినితోఁగూడ, పంచినన్=పంపఁగా, ఆకుమారునిన్ కూతున్ = ఆకూఁతురు కొడుకులను జూచి.

ఆ. వశముగాక బాష్ప ♦ వారి యొల్కుచునుండఁ
గొడుకుఁ గూఁతు నెత్తి ♦ కొని నలుండు
హర్ష పులకితాంగుఁ ♦ డై నిజాంకతలంబు
నందు వారినునిచి ♦ యాదరమున. 197

టీ. నలుఁడు, బాష్పవారి = కన్నీరు, వశముకాక = స్వాధీనముకాక ఒల్కుచున్ వుండన్=కాఱుచుండఁగా, కొడుకున్, కూఁతున్, ఎత్తుకొని, హర్ష పులకిత అంగుండు ఐ=సంతోషముచే గగుర్పాటుతోఁగూడిన శరీరము గలవాఁడై, నిజఅంకతలంబునందు = తనతొడమీఁద, వారిని = ఆకొడుకు కూఁతులను, వునిచి = కూర్చుండఁబెట్టుకొని, ఆదరమునన్ = ప్రీతితో.

వ. అక్కేశినింజూచి యిక్కుమారు లిద్దరు నా కొడుకును గూఁతునుంబోలిన వీరి నెత్తికొని దుఃఖించితినని తన్నెఱ్ఱుపడ కుండం బలికి దానికిట్లనియె. 198

టీ. ఆకేశినిన్, చూచి; ఈకుమారులు = బిడ్డలు ఇద్దఱు; నాకొడుకున్ కూఁతునున్ పోలినన్ = నాబిడ్డలవలెనుండఁగా, వీరిని; ఎత్తుకొని; దుఃఖించితిని; అని; తన్నున్ = తనసంగతి; ఏర్పడకవుండన్ = తెలిసికొనకుండునట్లు; పలికి = చెప్పి; దాసికిన్, ఇట్లు, అనియెన్.

క. నీవిట పలుమఱు వచ్చుచుఁ
బోవుచు నునికిఁ గని చిత్త • ముల నొండుగ సం
భావింతు రితర జనములు
కావున రావలవదింకఁ • గార్యార్థినివై. 199

టీ. నీవు; ఇటన్ = ఇచ్చటికి; పలుమఱు = అనేకపర్యాయములు; వచ్చుచున్ పోవుచు వునికిన్ = రాకపోకలు చేయుచుండుటచేత; ఇతరజనములు = పొరుగువారు; కని = చూచి; చిత్తములన్ = మనస్సులందు; ఒండుగన్ = వేఱురీతిగా; సంభావింతురు = తలంతురు, కావునన్; ఇంకన్ = ఇఁకమీఁదట; కార్యార్థినివి ఐ = పనులను గోరినదానవై; రాన్ వలవదు = రావద్దు.

వ. ఏము దేశాంతరంబుననుండి వచ్చినయతిథులము. నీకు మాతోడిదేమి! యనినఁ గేశినియుఁ గ్రమ్మఱి వచ్చి బాహుకు మార్గంబంతయు దమయంతికిం జెప్పిన నది సంతసించి నిజ జననికిట్లనియె. 200

టీ. ఏము; దేశాంతరమున నుండి = ఇతరదేశములనుండి; వచ్చిన యతిథులము = విందులము, నీకున్, మాతోడిది = మాతోఁగావలసినది; ఏమి; అనినన్, కేశినియున్; క్రమ్మఱి = తిరిగి; వచ్చి; బాహుకుమార్గంబు = బాహుకునిరీతి; అంతయున్ = యావత్తును; చెప్పినన్ = చెప్పఁగా;

అది = ఆదమయంతి, సంతసించి; నిజజననికిన్ = తన తల్లితో; ఇట్లు అనియె.

ఉ. సందియ మేల సర్వగుణ♦సంపదఁ జూడఁగ బాహుకుండు భూ
వందితుఁడైన నైషధుఁడ♦వశ్యము దాన గు నామనంబు నా
నందమునొందుచున్న దిఘ♦నంబుగ వాఁడిటవచ్చువాఁడొ యే
నందులకేఁగుదాననొ న♦యంబుగ నానతి యిమ్ము నావుడున్.

టీ. సందియము = సంశయము; ఏల = ఎందుకు; సర్వగుణసంపదన్ = యావత్తు సుగుణముల కలిమిని; చూడన్ కన్ = యోచించిచూడఁగా; బాహుకుండు; తాను; అవశ్యము = తప్పక; భూవందితుఁడు = భూమియందలి జనులచే స్తోత్రము చేయఁబడువాఁడు; ఐన నైషధుఁడు = నలుఁడు; అగును, నామనంబును = నామనస్సునైతేను, ఆనందమునన్, సంతోషమును, పొందుచున్నది, ఘనంబుగన్ = మర్యాదతో, వాఁడు = ఆనలుఁడు, ఇటకున్ = ఇచ్చటికి, వచ్చువాఁడో = వచ్చుటయో, ఏను, అందులకు = అచ్చటికి, ఏఁగుదాననో = పోవుటయో, నయంబుగన్ = చక్కఁగా, ఆనతి, ఇమ్ము, నావుఁడున్ = అని యడుగఁగా.

వ. అది యప్పుడు భీము ననుమతంబున దమయంతియొద్దకు బాహుకు రావించిన. 202

టీ. అది = ఆదమయంతియొక్క తల్లి, భీమునను మతంబునన్ = భీముని యంగీకారముచేత, దమయంతి యొద్దకున్, బాహుకున్, రావించినన్, పిలిపింపఁగా.

క. చనుదెంచి యందు దీనా
నన నవిరళపంకమలిన ♦ నతగాత్రిఁ దప

స్విని నతికృశ దమయంతిం
గనియె నలుం డుదిత బాష్ప ♦ కణకలితముఖిన్.        203

టీ. నలుఁడు, చనుదెంచి = వచ్చి, అందున్ = ఆభీమరాజుగృహంబునందు, దీనఆననన్ = వ్యసనముగల ముఖముగలదియు, అవిర ... గాత్రయు - అవిరళ = దట్టమైన, పంక = బురదవలె, మలిన = మురికియైన, నత = వంగిన; గాత్రయు = శరీరముగలిదియు, తపస్విని = దుఃఖపడుచుండునదియు, అతికృశన్ = మిక్కిలి చిక్కినదియు, ఉదిత...ముఖిన్ - ఉదిత = పుట్టిన, బాష్ప = కన్నీటియొక్క, కణ = బిందువులతో, కలిత = కూడిన, ముఖిన్ = మోముగలదియునైన, దమయంతిన్, కనియెను.

క. దమయంతి నలుని వికృతాం
గముఁ జూచియు నతని నన్యుఁ ♦ గా వగవక నె
య్యమునను లజ్జను భయ సం
భ్రమమున వివశాత్మయగుచుఁ ♦ బతికిట్లనియెన్.        204

టీ. దమయంతి, నలుని వికృతాంగమునను = నలునియొక్క, యసహ్యరూపంబును, చూచియున్ = చూచినప్పటికిని, అతనిన్, అన్యుంగాన్ = వేఱొకనిఁగా, వగవక = ఎంచక, నెయ్యమునను = ప్రేమచేతను, లజ్జను = సిగ్గుచేతను, భయసంభ్రమమునన్ = భీతిచేతను, తత్తఱపాటుచేతను, వివశ ఆత్మ అగుచున్ = స్వాధీనము తప్పిన తెలివిగలదయి, (స్మృతిలేనిదై) పతికిన్, ఇట్లు అనియెన్.

వ. విజనంబైన విపినంబున నలసి నిద్రవోయినయబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధిం బాణిగ్రహ విధిలబ్ధయైన

దానిం బాసి నలునట్లు నిర్దయుఁడై యరిగినవార లొరు
లెవ్వరు లేరు. 205

టీ. విజనంబైన విపినంబునన్ = మనుష్యసంచారము లేని యడవియందు అలసి = శ్రమపడి, నిద్రపోయిన, అబలన్ = ఆడుదానిని, అతిసాధ్విన్ = మిగుల మంచిదానిని, అనువ్రతన్ = తన్నుఁబోలినదానిని, అగ్నిసన్నిధిన్ = అగ్నిహోత్రునియెదుట, పాణిగ్రహణవిధిలబ్ధ యైనదానిన్ = పెండ్లియను కార్యముచే పొందఁబడినదానిని, పాసి = వదలిపెట్టి, నలునట్లు = నలునివలె, నిర్దయులై = కనికరములేనివారయి అరిగినవారలు = పోయినట్టి మానవులు, ఒరులు = ఇతరులు, లేరు.

క. సురవరులను మెచ్చక తను
వరియించిన నన్నుఁ బుత్త్రవతి నేలొకొ చె
చ్చెరవిడిచె నాతనికి ని
ష్కరుణున కే నేమి యెగ్గు గావించితినో. 206

టీ. సురవరులన్ = వేల్పులలో పెద్దలను, మెచ్చక = కోరక, తనున్ (నలునిఅనుట) వరియించిననన్నున్ = కోరిననన్ను, పుత్త్రవతినిన్ = బిడ్డలు గలదానిని, ఏలొకో = ఎందుకో చెచ్చెరన్ = వెంటనే విడిచెను, నిష్కరుణునకున్ = దయమాలినవాఁడగు; నాతనికిన్, ఏను; ఏమి; ఎగ్గు = అపకారము; కావించితినో = చేసితినో.

వ. ప్రాణసమానయైన నన్ను విడువనోడకుండు మనిన యప్ప
లుకు నేల మఱచెనోయని శోకతప్తంబైన తనహృదయంబుఁ
దడుపుచున్నదియునుంబోలె బాష్పధారల నురస్స్థలంబుఁ
దడుపుచున్న దమయంతిం జూచి దుఃఖాకులుండై నలుం
డిట్లనియె. 207

టీ. ప్రాణసమానవు ఐన నిన్నున్; విడువను=విడిచిపెట్టను. ఓడక ఉండుము=భయపడకుండుము, అనిన ఆపలుకులు=చెప్పినయామాటలు; ఏల మఱచెనో; అని శోకతప్తాంబు = దుఃఖముచే మాడినది; ఐన, తన హృదయంబున్=తనమనస్సును; తడుపుచున్నదియునుంబోలెన్=తడుపుదానివలె, బాష్పధారలన్=కన్నీటిధారలచేత; పురస్థలంబున్=ఱొమ్మును; తడుపుచున్న దమయంతిన్; చూచి; నలుండు; దుఃఖఆకులుఁడు = వ్యసనముచేఁ గలవరపడినవాఁడై, ఇట్లు, అనియెన్.

తే. కలిసమావిష్టమతినయి ♦ కష్టవృత్తి
నట్టి యిడుమను బడితి నే ♦ నది మదీయ
తపముబలమున దుష్కర్మ ♦ దహనమునను
నష్టమైపోయె నిప్పుడు ♦ నన్ను విడిచి. 208

టీ. నేను; కలి...మతినిఅయి-కలి = కలిపురుషునిచే; సమావిష్ట=ప్రవేశింపఁబడిన; మతినయి = బుద్ధిగలవాఁడనై; కలిపురుషుని ప్రేరణచేత; కష్టవృత్తిన్ = నీచతనముతో, అట్టియిడుమను = అట్టికష్టమందు; పడితిని=చిక్కికొంటిని, అది = ఆకలిపురుషుఁడు; మదీయ...లమునన్-మదీయ = నాదైన; తపము=తపస్సుయొక్క; బలమునన్=బలిమిచేతను; దుష్కర్మదహనమునన్=చెడుకర్మ నశించిపోవుటచేతను; ఇప్పుడు; నన్ను; విడిచిపోయెను.

వ. ఏనిందులకు నీతదర్థంబువచ్చితి నది యట్లుండె, నన్ను నను
రక్తు ననువ్రతుఁ దలంపక యన్యాపేక్షం బునస్స్వయం
వరంబు రచియించుటది కులస్త్రీధర్మంబుగాదు. రాజులనెల్ల
నీస్వయంవరంబునకు రావించుటం జేసి కాదె ఋతుపర్ణుండు
వచ్చెననిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె.

టీ. ఏను; ఇందులకున్ = ఇప్పటికి; నీతదర్థంబు = నీకొఱకు; వచ్చితిని, అదిఅట్లు ఉండెన్ = ఆసంగతి యట్లుఉండనిమ్ము, అనురక్తున్ = ప్రీతిగల

వానిని; అనువ్రతున్ = ఏకపత్నీవ్రతముగలవానిని, నన్నున్; ఎంచక = తలంపక; అన్యఅపేక్షన్ = వేఱొక్కనియందు మనస్సుతో; పునఃస్వయంవరంబు = మఱలస్వయంవరము; రచియించుట అది = చేయుట; కులస్త్రీధర్మంబుకాదు, రాజులన్ ఎల్లన్ = రాజులనందఱిని; ఈస్వయంవరంబునకున్; రావించుటన్, చేసికాదె = పిలిపించుటచేతనేకదా, ఋతుపర్ణుఁడు వచ్చెను, అనినన్ = అని నలుఁడు చెప్పఁగా. దమయంతి; కృత అంజలి ఐ = చేతులుజోడించినదై, ఇట్లు; అనియెన్.

తే. నిన్ను రోయంగ విప్రులు ♦ నెమ్మి నరిగి
పలికి రెల్లచో నాచేతఁ బలుకఁబడియ
యందుఁ బర్ణాదుఁడను విప్రుఁ ♦ డయ్యయోధ్య
కేఁగి ప్రతివచనంబుల ♦ నెఱిఁగె నిన్ను. 210

టీ. నిన్నున్; రోయంగన్ = వెదకుటకు; విప్రులు = బ్రాహ్మణులు, నెమ్మిన్ = ప్రేమతో; అరిగి; నాచేతన్ పలుకఁబడిఅ = చెప్పఁబడినట్లె; ఎల్లచోన్ = అన్నిచోట్లను; పలికిరి. అందున్ = వారిలో; పర్ణాదుఁడు అను విప్రుడు = బ్రాహ్మణుఁడు, ఆ అయోధ్యకున్; ఏఁగి, నిన్నున్; ప్రతివచనంబులన్ = నీబదులుమాటచేత; ఎఱింగెను = గుర్తుపట్టెను.

వ. ఆ పర్ణాదువలన నెఱింగినదాననై నిన్నిట రావించు నుపాయంబుఁ దలంచి యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరం బగునని ఋతుపర్ణుకడం బ్రకాశింప సుదేవుండను బ్రాహ్మణుం బుత్తెంచితి. 211

టీ. ఆపర్ణాదువలనన్; (నీవృత్తాంతంబు) ఎఱింగినదాననై; నిన్నున్; ఇటన్; రావించునుపాయంబున్ = పిలిపించునుపాయము, తలంచి; ఎల్లి = రేపు; దమయంతి ద్వితీయస్వయంవరంబు; అగును = జరుగును, అని; ఋతుపర్ణుకడన్ = ఋతుపర్ణుని సమీపమున, ప్రకాశింపన్ = తెలియబఱచుటకు; సుదేవుండు అనుబ్రాహ్మణుని, పుత్తెంచితిని = పంపితిని.

క. నరవరుఁడు నలుఁడు కాకె
వ్వరు శతయోజనము లొక్క ♦ వాసరమున వ
త్తురు నరులో రులని దీనిం
బరికింపఁగ వేఁడి యిట్లు ♦ పంచితి నధిపా! 212

టీ. అధిపా = ఓనాథా, నరవరుఁడు = మనుజులలో శ్రేష్ఠుండయిన, నలుఁడుకాక = నలుఁడుతప్ప, ఎవ్వరు, శతయోజనములు = నూఱామడలు, ఒక్కవాసరమునన్ = ఒక్కదినంబులోపల, వత్తురు = రాఁగలరు,అని, దీనిన్ = ఈసంగతిని, పరికింపన్ = పరీక్షించుటకై, వేఁడి = కోరి, ఇట్లుపంచితిని = బ్రాహ్మణు నంపితిని.

ఉ. ఏనొక పాపభావమును ♦ నెగ్గుఁదలంపఁ దలంపకొండుగా
నానతవైరి! నీయడుగు ♦ లంటఁగనోపుదునట్లయైన న
న్నీనలినాప్తుఁడీయనలుఁ ♦ డీమృగలాంఛనుఁడీసురోత్తముల్
జానువడంగ నాక్షణమ ♦ చంపరె కోపపరీతచిత్తులై. 213

టీ. ఆనతవైరి = శత్రువులనుస్వాధీనముఁజేసికొనినయోనాథా, ఏను, అతి పాపభావమునన్ = ఎక్కువచెడుతలంపుతో, ఎగ్గు = చెఱుపు, తలంపను = ఎంచిన దానను గాను, ఒండుగాన్ = వేఱొక్కవిధముగా, తలంపను(ము) = ఎంచను ము, నీఅడుగులు = నీపాదములు, అంటఁగన్, ఓపుదును = చాలుదును, అట్లు అయిన్ = అపరికారమే యన్యుఁకోరియున్నయెడల, నన్ను ఈనలినఆప్తుఁ డు = (తామరలకిష్టుఁడైన) ఈసూర్యుఁడు, ఈ నలుఁడు = ఈఅగ్నిహోత్రుఁ డు, ఈమృగలాంఛనుఁడు = ఈచంద్రుఁడు (కుందేటినిఁ జేతఁబట్టినవాఁడు) ఈ సురఉత్తముల్ = ఈదేవతలలో గొప్పవారు, కోపపరీతచిత్తులు ఐ = కోపము చేఁ జుట్టఁబడినమనస్సుగలవారై, జానువు = సొగసు, అడఁగన్ = నశించు

నట్లు, ఆక్షణము అ = ఆవెంటనే, చంపరు ఎ = చంపరా. (నేను నిన్నుఁదప్పఁ యితరునిఁ గోరియుందునేని, సూర్యచంద్రాదులగు దేవతలు నీపాదములంటిన నన్ను దహింపఁజేయుదురు.) అని తా.

వ. అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుండైన వాయుభట్టారకుం డెల్లవారును విన నాకాశంబుననుండి నలున కిట్లనియె. 214

టీ. అనుచున్న, అవసరంబునన్ = సమయమునందు, అఖిలభూతఅంతర్గతుఁడుఅయిన = అన్ని ప్రాణులలోపల నుండునట్టి, వాయుభట్టారకుండు = వాయుదేవుఁడు, ఎల్లవారను = అందఱును, వినన్ = ఆలకించునట్లు, ఆకాశంబునన్, వుండి, నలునకున్, ఇట్లు, అనియె.

చ. అమలచరిత్ర నిట్లు దమ ♦ యంతిఁ
బతివ్రతఁ బల్కెదే నృపో
త్తమ! విను దీనియందు విది ♦ తంబగు
శీలనిధిన్ సుధాంశుఁడున్
గమలహితుండు నేనుఁ దగఁ ♦ గాచితి
మొక్కట మూఁడు వర్షముల్
క్రమమున దీనిఁ జేకొనుము ♦ కోమలి
నీకనురక్తనాపుఁడున్. 215

టీ. నృపవుత్తమ = రాజశ్రేష్ఠుఁడా, వినుము, అమలచరిత్రన్ = నిర్మలమైన నడవడిగల, పతివ్రతన్, దమయంతిని, ఇట్లు, పల్కెదువు ఎ = ఆశ్చర్యమ్మునా? దీనియందున్ = ఈదమయంతియందు, విదితంబు = కనిపించునట్టి, అగు, శీలనిధిన్ = నడవడియను కాణాచిని, సుధాంశుఁడును = చంద్రుఁడును, కమలహితుండును = సూర్యుఁడును, నేనును, ఒకటన్ = కూడి, మూఁడువర్ష

ముల్ = మూఁడేండ్లు, తగన్ = ఒప్పునట్లు, బాగుగా, కాచితిమి = కాపాడితిమి, కొమరుగన్ = బాగుగా, దీనిన్, చేకొనుము = గ్రహింపుము, కోమలి = ఈదమయంతి, నీయన్ = నీయందు, అనురక్త = ప్రేమగలది, నావుఁడున్ = అని చెప్పఁగా (వై. ప. అ)

క. కురిసె మరుద్వచనానం
తరమున సురపుష్పవృష్టి ♦ తడయక మ్రోసెన్
సురదుందుభినాదంబులు
గరము ప్రశస్తముగ వీచె ♦ గంధవహుండున్. 216

టీ. మరుద్వచన అనంతరమునన్ = వాయుదేవునిమాటలు పూర్తి అయిన తర్వాత, సురపుష్పవృష్టి = దేవతలు గురిపించినపుష్పవర్షము, కురిసెన్, సురదుందుభినాదములు = వేల్పులభేరీవాద్యముల మ్రోఁతలు; మ్రోసెన్ = మ్రోఁగెను, గంధవాహుండును = వాయువును; కరము = మిక్కిలి; ప్రశస్తముగన్ = తిన్నఁగా. వీచెన్ = విసరెను.

వ. ఇట్లెల్లవారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు తన్నెఱింగించి దమయంతీ పతివ్రతాగుణంబులును బతియందలి యకృత్రిమానురాగంబును జెప్పినవిని నలుండుపరమప్రమోద పరిపూర్ణహృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి వానియిచ్చిన పుట్టంబుపైఁ బెట్టుకొని నిజరూపంబు దాల్చిన.

టీ. ఇట్లు ఎల్లవారికిన్, ఆశ్చర్యంబుగాన్ = సంతోషముగలుగునట్లు, వాయుదేవుఁడు, తన్ను ఎఱింగించి = తానెవ్వఁడైనది తెలిపి, దమయంతీ పతివ్రతాగుణంబులును = దమయంతీదేవియొక్క పాతివ్రత్యమహిమమును, పతియందలి = భర్తయందలి, అకృత్రిమానురాగంబును = కపటముగాని ప్రీతిని,

చెప్పఁగన్ = తెలుపఁగా, విని, నలుఁడు, పరమ ప్రమోద పరిపూర్ణ హృదయుండు ఐ-పరమ = ఎక్కువ, ప్రమోద = సంతోషముచేత, పరిపూర్ణ=నిండిన, హృదయుండు ఐ = మనస్సుగలవాఁడయి, తత్క్షణంబున = వెంటనే, కర్కోటకున్, తలంచి, వానియిచ్చిన పుట్టంబు = ఆ కర్కోటకుఁడొసంగిన వస్త్రంబును, పైన్ = మీఁద, పెట్టికొని = ఉంచుకొని, నిజరూపంబున్ = తనస్వరూపంబును, తాల్చినన్ = ధరింపఁగా.

ఉ. ఆయతబాహుఁ దప్తకన • కాంచితవర్ణు మనోజరూపు నిం
దాభియుతు సూర్యతేజు నిష•ధప్రభునన్నలుఁజూచి పద్మప
త్రాయతచారునేత్ర దమ•యంతి కరంబు ముదంబునొందిల
క్ష్మీయుతయయ్యెబంధులకు • మిత్రులకున్హృదయప్రియంబుగన్.

టీ. ఆయతబాహున్ = నిడుపుచేతులుగలవానిని, తప్త కనక అంచిత వర్ణున్-తప్తకనక = అపరంజివంటి, అంచిత = ఒప్పిన, వర్ణున్ = శరీరచ్ఛాయగలవానిని, మనోజరూపున్ = మన్మధుని రూపంబుగలవానిని, ఇంద్రునివలె నాచరించువానిని, ఇంద్రునివలెనుండువానిని, సూర్యతేజున్ = సూర్యునివంటి ప్రకాశముగలవానిని, నిషధప్రభున్ = నిషధదేశపురాజును, అనలున్ = అనల మహారాజును, చూచి, పద్మ... నేత్ర-పద్మపత్ర = తామరపువ్వురేకువలె, ఆయత = నిడివియైన, నేత్ర = కన్నులుగలదయిన, దమయంతి, కరంబు = మిక్కిలి, ముదంబున్ = సంతోషమును, ఒంది = పొంది, బంధులకున్ = చుట్టాలకును మిత్రులకున్ = చెలులకును, హృదయప్రియంబుగన్ = మనస్సున కింపుగలుగునట్లుగా, లక్ష్మీయుత = కాంతితోఁగూడినది, అయ్యెను.

వ. ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహ పరితాపంబు
తోన శరీర మలినత్వంబువాసెఁ, బరస్పరానురాగంబు
తోన విభూషణ విశేషంబులు విలసిల్లె, నంత నంతయువిని

భీముండు జాతసస్యయైన వసుధ తోయసంప్రాప్తి నాప్యా
యితయై నట్లు జ్ఞాతచర్యుండయిన పతిం బడసి పరమసంతుష్ట
హృదయయై చంద్రుతోఁ గూడిన రాత్రియుంబోలె నొప్పా
చున్న దమయంతిం జూచి సంతసిల్లి తనపురంబునం దష్ట
శోభనంబులు దేవగృహంబులయందు విశేష పూజలు సే
యించె నట్టిమహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు
వచ్చి నీవు నిఖిలలోకపూజ్యుండవయ్యును నాయొద్ద బాహు
కుండనం బ్రచ్ఛన్నవృత్తి నున్న నిన్నెఱుంగక నీచకర్మంబు
లందు నియోగించితి దీని క్షమియింపుమని నలుచేత సత్కృ
తుండై యశ్వహృదయం బుపదేశంబు గొని యయోధ్య
కుం జనియె, నట నలుండును విదర్భాపురంబున నొక్కమా
సంబు నివాసంబు సేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి
నందయునిచి యొక్కరథంబును బదునాఱేనుఁగులును నేఁ
బదిగుఱ్ఱంబులు నాఱునూఱు కాల్బలంబును దనతోఁడు
గా నిషధపురంబున కరిగి పుష్కరుంగని యిట్లనియె. 219

టీ. ఇట్లు, సంగతులు = కూడినవారు, ఐన, ఆయిరువురకున్ = ఆనల దమయంతులకు, విరహపరితాపంబుతోన్ అ = ఎడఁబాటువలని సంతాపంబుతోఁగూడ, శరీరమలినత్వంబు = దేహములోని ముఱికి, వాసెను = తొలఁగెను, (విరహతాపంబడంగెను. దేహమున ముఱికియుఁబోయెను.) పరస్పరానురాగంబుతోన్ అ = ఒండొరుల మీఁది చెలిమితోఁగూడ, విభూషణవిశేషములు = గొప్పసొమ్ములు, విలసిల్లెన్ = ప్రకాశించెను, ఒండొరులమీఁద ప్రేమ గలిగెను, (వారు దాల్చిన భూషణములు ప్రకాశించెను.) అంతన్ = పిమ్మట, అంతయున్ = సవిస్తరముగా, విని, భీముఁడు, జాతసస్య = పైరులుగలది, ఐన, వసుధ = భూమి, తోయసంప్రాప్తిన్ = నీళ్లు పోయుటచేత, ఆప్యాయితయైనట్లు = తృప్తి

నొందినట్లు, అజ్ఞాత చర్యుఁడు = పోవిడి తెలియకయుండినవాఁడు, అయిన పతిన్, పడసి = పొంది, పరమసంతుష్టహృదయ ఐ = ఎక్కువ సంతసముతోఁ గూడిన మనస్సుగలదై, చంద్రునితోన్, కూడిన, రాత్రియున్ పోలెన్ = రాత్రివలె, ఒప్పుచున్న = ప్రకాశించు, దమయంతిన్, చూచి, సంతసిల్లి తనపురంబునందున్, అష్ట శోభనంబులు = ఎనిమిది విధంబులైన అలంకారములను, దేవగృహంబులందున్ = దేవాలయములందు, విశేషపూజలు = ఎక్కువపూజలు, చేయించెను, అట్టిమహోత్సవంబు = అట్టి గొప్పవేడుక జరుగుట, ఎఱింగి = చూచి, ఋతుపర్ణుండు, నలునొద్దకున్, వచ్చి, నీవు, అఖిలలోకపూజ్యుండవు = జనులందరిచేఁ గొనియాడఁబడినవాఁడవు, అయ్యున్ = అయినప్పటికిని, నాయొద్దన్, బాహుకుండు అనన్ = బాహుకుఁడని, ప్రచ్ఛన్నవృత్తిన్ = గోప్యమైనరూపముతో, వున్న, నిన్నున్, ఎఱుంగక, నీచకర్మలయందున్ = వంటచేయుట మొదలగు హీనపుఁబనులయందు, నియోగించితిని = వుంచితిని, దీనిన్ = ఈప్రకారముచేయుటను, క్షమింపుము = ఓర్చుకొనుము, అని, నలుచేతన్, సత్కృతుండై = మన్ననచేయబడినవాఁడై, అశ్వహృదయంబు అనుపేరుగల విద్యను, వుపదేశఁబుగొని = తెలిసికొని, అయోధ్యకున్, చనియెన్, అటన్ = అచ్చట, నలుండును, విదర్భాపురంబునన్, ఒక్కమాసంబు, నివాసంబుచేసి = వుండి, విదర్భేశ్వరున్ = భీమరాజును, వీడ్కొని, దమయంతిన్, అందున్ అ = అచ్చటనె, వునిచి, ఒక్కరథంబును, పదునారు ఏనుఁగులును, ఏఁబదిగుఱ్ఱములును, ఆఱునూఱు కాల్బలంబులును, తనకున్, తోడు = సాయముగా, కాన్ = కాఁగా, నిషధపురంబునకున్, అరిగి, పుష్కరున్, కని, ఇట్లు, అనియెన్.

క. దమయంతి రోయిగా జూ
దము నీతో నాడఁ గడఁగె ♦ దను ధరణీరా
జ్యము నీవు నాకు రోయిడు
మమరఁగ జూదంబు నీకు ♦ నభిమత మేనిన్. 220

టీ. అమరంగన్ = ఒప్పిదముగా, నీకున్, జూదము, అభిమతమేని = ఇష్టమైనయెడల, దమయంతి, రోయిగాన్ = పందెముగా, నీతోన్, జూదము ఆడన్, కడంగెదను = పూనెదను, ధరణీరాజ్యము = నిషధదేశమును, నీవు, నాకు, రో = పందెముగా, ఇడుము = పెట్టుము. (నేను దమయంతిని పందెముగాఁ బెట్టెదను. నీవు రాజ్యము పందెముగాఁ బెట్టుము. ఇట్లు పందెముగాఁ బెట్టుకొని జూదమాడుదము రమ్ము అని నలుఁడు పుష్కరునిఁ బిలిచెను.)

మత్త. వీరభోజ్యము సుమ్ము రాజ్యము ♦ వింటె నీవును నేను దు
ర్వారవృత్తిరథంబులెక్కి య ♦ వంధ్యవిక్రమ మేర్పడన్
భూరివీరరణంబొనర్తము ♦ పోరనోర్చినవాఁడ యి
ద్ధారుణీతలరాజ్యసంపదఁ ♦ దాల్చు వీరగుణోన్నతిన్. 221

టీ. రాజ్యము, వీరభోజ్యము సుమ్ము = అనుభవింపఁదగినదే కదా, వింటె = నీవును వినియున్నావుగదా, నీవును, నేనును, దుర్వారవృత్తిరథంబులు = దుర్వార = నిలువరాని, వృత్తి = ప్రవేశముగల, రథంబులు = తేరులు, ఎక్కి, అవంధ్యవిక్రమము = తగనిపరాక్రమము, ఏర్పడన్ = వెల్లడియగునట్లు, భూరివీరరణంబు = గొప్పశూరులచేయు యుద్ధంబును, ఒనర్తము = చేయుదము, పోరన్ = యుద్ధమునందు, ఓర్చినవాఁడే = గెల్చినవాఁడే, వీరగుణవున్నతిన్ = శౌర్యముచే గలిగిన ఖ్యాతిచేత, ఈ ధారుణీతలరాజ్యసంపదన్ — ఈ భూమండలమున కధిపతియగుటయను ఐశ్వర్యమును, తాల్చును = పొందునుగాక.

వ. ఈ రెంటిలో నీకెయ్యది యిష్టంబు దానికిం గడంగుమనినం బుష్కరుండు రణంబునఁ బరాజితుండనగుదు. నలుండొల్లియు జూదంబున నోడించినవాఁడను గావున నింకను నోడించి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదునని సంతసిల్లి యేనోటువడితినేని నఖిలమహీరాజ్యంబు నీయదియు న్నీ

వోటుపడి తేని దమయంతి నాయదియని పలికి యొడ్డి నలుతో
జూదమాడి యోటువడిన. 222

టీ. ఈరెంటిలో = జూదము పోరులలో, నీకున్, ఎయ్యది, ఇష్టంబు, దానికిన్, కడంగుము = పూనుము, అనినన్, పుష్కరుండు, రణంబునన్, పరాజితుండను, అగుదును = ఓడిపోదును, నలున్, తొల్లియున్ = మునుపు, జూదంబునన్, ఓడించినవాఁడన్ = ఓడఁగొట్టినవాఁడ, కావునన్, ఇంకను = మఱియు, ఓడించి, దమయంతిన్, చేకొని = పొంది, కృతార్థుఁడనగుదును = కోరిక నొందెదను, అని సంతసించి, ఏను, ఓటుపడితిని ఏని = ఓడిపోతినేని, నిఖిల మహీరాజ్యంబు = భూమండల ప్రభుత్వమంతయు, నీయది అ = నీదె, నీవు, ఓటుపడితివి ఏని = ఓడినయెడల, దమయంతి, నాయది = నాది, అనిపలికి, ఒడ్డి = పందెముగా పెట్టి, నలుతోన్, జూదమాడి, ఓటుపడినన్ = ఓడిపోవఁగా. (వై. ప. అ.)

క. ఘనముగ జంబూద్వీపం
బునఁ గలవారెల్ల నెఱుఁగఁ ♦ బుష్కరుచేతం
గొనియెఁ బునర్ద్యూతంబున
ననఘుఁడు నలుఁ డఖిలరాజ్య ♦ మత్యున్నతితోన్. 223

టీ. ఘనముగన్ = గొప్పఁగా, జంబూద్వీపంబున్, కలవారు ఎల్లన్ = ఉన్న జనులందఱు, ఎఱుఁగన్ = తెలిసికొనునట్లు, పునర్ద్యూతమునన్ = తిరిగి జూదమున, పుష్కరు చేతన్ = పుష్కరునివలన, అనఘుఁడు = పాపములేని నలుఁడు, అత్యున్నతితోడన్ = ఎక్కువగౌరవముతో, అఖిలరాజ్యము = రాజ్యమునంతయు, కొనియెన్ = లాగికొనెను.

వ. ఇట్లు జూదంబునఁ బుష్కరునోడిచి సకలమహీరాజ్యంబును
జేకొని నలుండు వాని కిట్లనియె. 224

టీ. ఇట్లు, జూదంబునన్, పుష్కరున్, ఒడిచి = ఓడించి, సకలమహీరాజ్యంబును = భూప్రభుత్వమునంతయు, చేకొని = గైకొని, నలుండు, వానికిన్, ఇట్లనియె.

క. కలి సంప్రాప్తుఁడవై కడు
బలమఱి నీచేతఁ దొల్లి ♦ బలవద్ద్యూతా
కులచిత్తుఁడయితి నది నీ
బలమని గర్వింపఁజనునె ♦ బలవంతుడవై. 225

టీ. కలిసంప్రాప్తుఁడవై = కలిపురుషునిచే నాక్రమింపఁబడినవాఁడవై, కడున్ = మిక్కిలి, బలముఅఱి = శక్తియుడిగి, నీచేతన్, తొల్లి = పూర్వము, బలవద్ద్యూతఆకులచిత్తుఁడును, బలవత్ = బలవంతముగా, ద్యూత = జూదముచేత, ఆకుల = చెదిరిన, చిత్తుఁడను = మనస్సుగలవాఁడను, ఐతిని, అది = అట్లగుట, నీబలము = నీశక్తి, అని, బలవంతుఁడవు ఐ = మొనగాఁడవై, గర్వింపన్ = మదించుట, చనునే = తగునా? (తగదని భావము.)

వ. నీవు నాపితృవ్యపుత్రుండ వెద్దియుం జేయనోపఁ బొమ్మని పుష్కరు విడిచిపుచ్చి పుష్కలంబైన రాజ్యంబుతో నలుం డున్నంత. 226

టీ. నీవు, నాపితృవ్యపుత్రుండవు = నా పినతండ్రి కుమారుండవు, ఎద్దియును = ఏమియు, చేయనోపను = చేయఁజాలను, పొమ్ము, అని, పుష్కరుని, విడిచిపుచ్చి = వదలిపెట్టి, పుష్కలంబు = నిండినది, ఐనరాజ్యంబుతోన్, నలుండు, వున్నంతన్ = వుండఁగా.

క. భీమప్రస్తాపితయై
కోమలి దమయంతి పుత్ర ♦ కులుఁ దానును ల

శ్రీమహిమ వెలుఁగుచుండఁగఁ
దామరసదళాక్షివచ్చెఁ దనపతి కడకున్. 227

టీ. భీమప్రస్థాపిత ఐ = భీమునిచేఁ బయనము చేసి పంపఁబడినదై, కోమలి = చిన్నదియగు, తామరసదళాక్షి = పద్మనేత్రయగు దమయంతి, సుత్రకులను = బిడ్డలను, తానును, శ్రీమహిమ = సంపదయొక్క యతిశయము, వెలుఁగుచుండఁగన్ = ప్రకాశింపగా, తనపతికడకున్ = తనభర్తయొద్దకు వచ్చెను.

వ. అట్లు తనహృదయేశ్వరియైన దమయంతింగూడి నలుండు విధివిహితానేకశతమఖుండై శతమఖువిలాసంబుతో సకల రత్నయుతంబైన రత్నగర్భాధిరాజ్యంబుచేసె గావున నక్షజితుండ నైతినని వగవకుండుము. నీవును దైవమానుష సంపన్నుండవై శత్రువులజయించి సకలమహీరాజ్యంబు వడయుదువని బృహదశ్వుండు ధర్మరాజునకు నక్షహృదయం బుపదేశించి. 228

టీ. అట్లు (వచ్చిన) తనహృదయేశ్వరి = తనకు ప్రాణనాయకి, ఐన, దమయంతిన్, కూడి = చేరి, నలుండు, విధి ..ఖుండు ఐ-విధి = శాస్త్రప్రకారము, విహిత = చేయఁబడిన, అనేక = పెక్కు, శతమఖుండు ఐ = నూఱుయాగములుగలవాఁడయి (శాస్త్రమందు జెప్పినరీతి నూఱుయాగములు చేసినవాఁడై), శతమఖువిలాసంబుతోన్ = దేవేంద్రునివంటి యైశ్వర్యముతో, సకలరత్నయుతంబు = అన్నిరత్నములతోఁగూడినది, ఐన, రత్నగర్భాదిరాజ్యంబు, భూపరిపాలనంబును, చేసెన్ = ఒనరించెను, కావున్, అక్షజితుండవు అయితివి = జూదమున నోడితివి, అని, వగవకవుండుము = చింతింపకుండుము, నీవును, దైవమానుష సంపన్నుండవు ఐ = దైవానుగ్రహము పురుషప్రయత్నములతోఁగూడిన

వాఁడవై, శత్రువులను, జయించి, సకలమహీరాజ్యంబు = భూమికంతయుఁ బ్రభుత్వమును, పడయుదువు, అని, బృహదశ్వుఁడు, ధర్మరాజునకున్, అక్షహృదయంబు-అను పేరుగల విద్యను, వుపదేశించి = చెప్పి.

సీ. ఇన్నలోపాఖ్యాన ♦ మెప్పుడు దత్తావ
ధానులై వినువారుఁ ♦ దవిలి భక్తి
జదివెడువారును ♦ జగతీశ ! కలిదోష
నిర్ముక్తులగుదురు ♦ నిఖిల పుణ్య
ఫలభాగులగుదురు ♦ బహుపుత్రపౌత్త్రాయు
రారోగ్య ధనయుక్త ♦ లగుదురెల్ల
విషములకును దుష్ట ♦ విషయంబులకు దూరు
లగుదురు ధర్మాత్మ ♦ లగుదు రుర్విఁ
తే. గడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ
యంతిఁ బుణ్యమూర్తి ♦ యైన నలుని
నుతచరిత్రుఁడైన ♦ ఋతుపర్ణుఁ గీర్తింపఁ
గలిభయంబులెల్లఁ ♦ దొలఁగు నధిప! 229

టీ. జగత్ ఈశా = ఓపుడమిఱేఁడా ! ఇనలోపాఖ్యానము = ఇనల చరిత్రము, ఎప్పుడు, దత్తావధానులు ఐ = గమనముంచినవారలై, వినువారున్, తవిలి = శ్రద్ధయుంచి, భక్తిన్ = భక్తితో, చదివెడువారును, కలిదోషనిర్ముక్తులు = కలిపురుషునిదోషములచే విడువఁబడినవారు అగుదురు, నిఖిలపుణ్యఫలభాగులు అగుదురు = అన్ని పుణ్యములనుపొందినవారయ్యెదరు, బహు...యుక్తులు-, బహు = హెచ్చిన, పుత్ర = కొడుకులు, కూతులు, పౌత్ర = మనుమలు, మనుమరాండ్రు, ఆయుః = దీర్ఘాయువు, ఆరోగ్య = సౌఖ్యము, వీనితో, యుక్తులు =

